# నివేదనము

"శ్రీగురుచరణద్వంద్వం వందేహం మథితదుస్సహద్వంద్వం
భ్రాంతి గ్రహోపశాంతిం పాంసుమయం యస్యభసితమాతను తే.
దేశికవరం దయాళుం వందేహం నిహతనిఖిలసందేహం
యచ్చరణద్వయ మద్వయ మనుభవ ముపదిశతి తత్పదస్యార్థం."

పరమపావన మగు నాంధ్రసారస్వతమునకుఁ గవిత్రయప్రసాదిత మగు భారతామ్నాయము, భాస్కరాది కవిప్రణీతమగు రామాయణకావ్యము, పోతనాది మహాభక్త కవిలిఖితమగు శ్రీమద్భాగవతపురాణము నిత్యనూతనములగు పట్టుఁగొమ్మలు. ఈ గ్రంథత్రయపఠనపారాయణాదికముచే నాంధ్రు లెల్లరు నిత్యముక్తులగుట నిస్సంశయము.

ఇందు భారతామ్నాయమునఁ గలకథాభాగములు సుధార్ద్రము లగు రసగుళికలు; పరమధర్మప్రబోధకములు, భవ్యార్థప్రతిపాదకములు ఉత్తమబ్రహ్మచర్యాశ్రమధర్మముల నుల్లేఖించుటలోను వివాహవయోగుణసామర్థ్యములఁ జాటుటలోను నాదర్శజీవనవిధులఁ దెలుపుటలోను నారణ్యానుశాసనికపర్వములఁ గల యష్టావక్రోపాఖ్యాన మత్యుత్తమము. ఆకథాభాగమును గైకొని నాకుఁ దోఁచిన రసోచితకించిద్విపర్యయములతోఁ గావ్యరూపమున లిఖించితిని ఈ కావ్యావతరణము నాకవితాకన్యకుఁ దొలిరూపము. ఉత్తమాదర్శాభిమానాభినివేశములే యీ జననాంధ్రభాషాభిమాన పురస్కృతభాషాసేవాసక్తియే నన్నీ కావ్యరచనమునకుఁ బురికొల్పినవి.

అష్టావక్రుఁడు మహోత్తమబ్రహ్మచర్యాశ్రమధర్మనిర్వాహకుఁడు; బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడు; అచంచలదీక్షానిరతుఁడు. విషయగౌర

వమును బురస్కరించుకొని పరమేశ్వర ప్రసాదితము లగుబుద్ధ్యుత్సాహములతోఁ బరమేశ్వరస్వరూపుఁడైననిజగురూత్తముపదపద్మారాధనమునకై యీకావ్యకుసుమమును సృజించి యర్పించితిని. పండితాగ్రణులు వాత్సల్యదృష్టి నాశీర్వదించి ప్రోత్సహించిరి. మఱియు, మదరాసు విశ్వవిద్యాలయమువారు దీనిని బి ఏ. పరీక్షకు, నాంధ్రవిశ్వవిద్యాలయమువారు భాషాప్రవీణతుదిపరీక్షకును బాఠ్యగ్రంథముగ నిర్ణయించిరి. తత్తదధికారుల కెల్లరకును గృతజ్ఞుఁడను.

ఈయష్టావక్రచరిత్రము భారతారణ్యానుశాసనికములందే కాక విష్ణుపురాణము బ్రహ్మవైవర్తపురాణము విచిత్రరామాయణము లందును గలదు. కాని భారతారణ్యానుశాసనికపర్వములఁ గల కథాభాగమే యిందు గృహీతము. ఈతనిపరిపూర్ణచరిత్రము నా 'శ్రీమహర్షి జీవితకథామృతము'న విపులీకరింపఁబడినది. అష్టావక్రుఁడు బాల్యముననే జనకాస్థానపండితసభలో వంది నోడించుటయుఁ బిమ్మట నిర్వక్రుఁ డగుటయుఁ బ్రస్తుతముద్రణమునఁ జేర్చితిని ఈతఁడు పిమ్మట జనకున కొనర్చినజ్ఞానోద్బోధము "అష్టావక్రసంహిత" యను వేఱుగ్రంథముగా రచించితిని.

నాసారస్వతజీవనప్రభాతమునకుఁ బ్రభాకరు లగుభాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు నాకు నిత్యస్మరణీయులు. వారి యాదరాభిమానగౌరవములే నాసారస్వతకృషికిఁ బట్టుఁగొమ్మలు. వారిని బరమేశ్వరుఁ డత్యంతముఁ గాపాడుఁగాక!

కాకినాడ,
వ్యయ శ్రావణ శుద్ధ ప్రతిపత్తు.

బుధజనవిధేయుఁడు,
బులుసు వేంకటేశ్వర్లు.

# ఉపోద్ఘాతము.

"నానృషిః కురుతే కావ్య" మ్మనియు, "శుచిః కవిః" అనియుఁ గవి ప్రశంస. కవిత భాషాపరిజ్ఞానమాత్రమున బహు గ్రంథపఠనమాత్రమున లభించునది కాదు. దానికి లోఁతయిన, సునిశితము, సహజము నైన ప్రజ్ఞాప్రతిభానము మూలము. అది కలవానికి భాషాపరిజ్ఞానాదు లుపకారము లగును. అంతేకాని యివి కవితను బుట్టింపఁజాలవు. అనేకత్ర వర్తమానులలోఁ గవితావ్యవహారము చుట్టుపట్టుల సహృదయులలోను, గ్రంథములలోను దేలియాడుచుండు భావముల పునశ్చర్వణరూపము లగుట గుర్తింపనగుచున్నది. ఇట్లుగాక యుపజ్ఞతో నుత్తమ కవితను వెలయించువారు కొందఱే యరుదైయున్నారు. ఈ "యష్టావక్రచరిత్రము" భారతచర్విత మేయైనను, దీని పునారచనమునఁ జక్కని యుపజ్ఞాకల్పమగు కల్పనము గలదు.

కాళిదాసు నాటకత్రయకథావస్తువులు కాళిదాసమనః ప్రవృత్తులకును, భవభూతి నాటకకథావస్తువులు భవభూతి మనఃప్రవృత్తులకును దర్పణము లైన తార్కాణలు. ఇక్కడ నీ యష్టావక్రచరిత్రమును బ్రస్తుత కవిమనఃప్రవృత్తులకు స్పష్టమైన తార్కాణ. నేటికాలమున విద్యాభ్యాసవ్రతు లయి గృహస్థులు గావలసియున్న విద్యార్థుల కందఱకు నీకథావస్తువు ముఖ్యముగా సమాలోచనోచితము. భారతము నుండి దీని నుద్ధరించి, కవి, యౌచితీసుందరముగ నించుక ప్రపంచించి, లఘుప్రబంధము కావించెను.

ఋషులనాఁటి యమాయికాఖ్యాయిక యిది. నాఁటిమునివాటికలు, ఆ మునుల మనఃప్రవృత్తులు, వారి యమాయికస్పష్టసత్యసంకల్పసంభాషణములు చక్కఁగా నిందు సంరక్షితము లైనవి. అంతరింపనున్న రఘుమహావంశమును అస్ఖలిత బ్రహ్మచర్యుఁడు, మహాశాంతమూర్తి, యమాయికుఁడు, నగు ఋశ్యశృంగుఁడు సంరక్షించినాఁడు; రామాదుల మహాపురుషులఁ దన తపోమహిమచే లోకమున కనుగ్ర

హించినాఁడు. వంశనాశనమునకు శపింపఁజాలిన విశ్వామిత్రాదులతీరునకు, వంశవర్ధనమున కనుగ్రహింపఁజాలిన ఋశ్యశృంగునితీరునకు నెంత భేదము!

మనకథలోని యష్టావక్రుఁడు ఋశ్యశృంగునితీరువాఁడు. మామవదాన్యుఁ డుత్తరదిగంతమునకుఁ బోయి రమ్మనుట యాతని బ్రహ్మచర్యదీక్షాపరాకాష్ఠను బరీక్షించుటకుఁ గదా! అందు కృతార్థుఁ డయి యాతఁడు రాఁ గల్గెను. ఇట్టి శీలనైశిత్యముకలవారు సర్వకాలములందును మహర్షికల్పులై యారాధనీయు లగుచునే యుందురు. భారతవర్షమున స్త్రీపురుషులలో నిట్టిశీలసంపద కొంతవఱకైన సురక్షితమగుచుండుటచేతనే నేఁటికిని నాధ్యాత్మికాభ్యున్నతి యిట జగజ్జ్యోతియై వెలుఁగుచున్నది.

కృతికర్త తనగురువరేణ్యునిఁగూర్చి చేసినప్రస్తుతి మనోజ్ఞమై, మహనీయమై, పైయర్థమునకుఁ దార్కాణమై యున్నది. నన్నిచోడుని గురుప్రస్తుతి దీనికి దీటు. భగవత్పరమైన గురుశిష్యాంతరంగవ్యవహారము, లౌకికబాహ్యవ్యవహారతంత్రమువలె వెల్లడికావలసినది కాదు. కనుక నిక్కడఁ గృతిపతు లగుకృతిప్రణేత గురువర్యుల నామాదినివేదనము కానరాకుండుట యౌచితీవిలసనమే యౌ నను కొందును. పరవిద్యాకన్యాప్రదాత యగు గురువరేణ్యుఁడును, దత్పరీక్షలలో నెగ్గి సద్విద్యాకన్యాపరిగ్రహము గావించిన ప్రస్తుతకృతిప్రణేత యగుశిష్యుఁడును, వదాన్యాష్టావక్రులలో నంతర్భవించిరేమో యని పాఠకులకుఁ దోఁచుచున్నారు.

ఈగ్రంథమున గద్యపద్యముల రచనాసౌష్ఠవము పేర్కొనుట యొకవిశేషవిషయముకాదు. శుచియైన యంతఃకరణముతో శుచియైనకథావస్తువును గుర్తించి దానిని శుచియైనభావతో వెలయించి "శుచిః కవిః" యన్నవైదికసూక్తికి మన 'కవికుమారుఁడు' తార్కాణమైనాఁడు. రసము నిందు శుచియ. సహృదయు లగు స్త్రీపురుషులు సంతోషముతోఁ జదువఁదగిన సద్గ్రంథ మిది.

వేటూరి ప్రభాకరశాస్త్రి,
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాపీఠము.

తిరుపతి.

# ఆశయము.

శ్రీకళాప్రపూర్ణ, సాహిత్య సమ్రాట్,
ఆంధ్రవిశ్వవిద్యాలయాధ్యక్ష, జయపురమహారాజ
శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు డి. లిట్.

పండిత శ్రీబులుసు వేంకటేశ్వరులు బి. ఏ., గారి విరచితమగు "అష్టావక్ర చరిత్రము" జదివితిని. అది యాశ్వాసత్రయయుతము; అందలిపద్యములు లలిత పదయుక్తము లయి మనోహరములుగా నుండుటవలనఁ దెలుఁగుభాస నెఱుఁగువారి సమాదరము నపొంది మెుందునని నానమ్మకము. అది ఛాత్త్రులపాఠ్యపుస్తక మగుటకుఁ జాలఁ దగియున్నది.

ఇట్లు,
జయపురము }
శ్రీ విక్రమదేవవర్మ.

# అభిప్రాయము.

## శ్రీ డాక్టరు గిడుగు వేంకట సీతాపతిగారు
### బి. ఏ. యల్. టి, లిట్. డి.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ., గారు రచించిన "అష్టావక్రచరిత్రము" అనే మూఁడాశ్వాసముల చిన్నకావ్యము ముద్దులమూటవలె నన్నాకర్షించినది. పద్యరచన మతి హృద్యముగా నున్నది. వయసునఁ జిన్నవా రయిన వీరి కింత ప్రౌఢరచనాసామర్థ్య మలవడినందులకు వీరి నెంత యభినందించినను దనివి తీరదు.

"వయసునఁ జిన్నవాఁడవు; ప్రభావమునం గడు పెద్ద విందు సం
శయ మది లేదు..." (౧-౧౨౦)

"వయసు చూడఁగ నడిమి యౌవనము కాని." (౨-౩౫)

మొదలైన కొన్ని పద్యము లీకావ్యమందుఁ గనఁబడినప్పు డవి వీరిపట్ల నన్వయము కాఁగల వని తోఁచినది.

"నేఁటి పాశ్చాత్య విజ్ఞాననీరధిఁ బడఁ, బ్రాచ్యవిద్యాసమార్జనపాటవంబు
సన్నగిలిపోవ జ్ఞానంబు సన్నగిల్లె, సన్నగిలిపోదె పాండితీసార మింక." (పీఠిక. ౨౦)

"అన్యకాంతలఁ దల్లుల యట్లుగాఁగఁ, గాంచఁజాలిన మానవగౌరవంబు
ఖండఖండాంతరముల నెక్కడను లేదు, పరమపావన భారతధరణిఁ దక్క." (౨-౬౧)

మొదలైన పద్యములందు శ్రీ వేంకటేశ్వరులుగారికిఁ గల స్వదేశవిజ్ఞానసద్గుణసంపదలయందుఁ గలయభిమానము :

"సద్గృహస్థులు లేనిదేశమ్ము వమ్ము, సద్గృహస్థులు కలుగుదేశమ్ము సొమ్ము." (౧-౧౨)

"బ్రహ్మచర్యాశ్రమంబున బ్రదుకుఁదెరువు, గార్హ్యధర్మప్రపాలన గౌరవంబు
సర్వ మీశ్వరార్పణబుద్ధి సహనశక్తి, నేర్పు నాశ్రమధర్మమన్నింట మెఱుఁగు"

మున్నగు పద్యములందు వీరిజీవితాశయములు;

"ఇరవుగ లోకవర్తన మెఱింగుచు కెఱుంగ గురూత్తమాంఘ్రి శం
కరుహావిశేషదాస్య మదికాక తదన్యము..." (౧-౮౭)

అనుపద్యమునను ఆతరువాతిపద్యములందును వీరికి గురుశిష్యసంబంధమందుఁ గల సద్భావాశయమును గానవచ్చుచున్నవి.

ముగ్ధప్రణయమును "కంటిని మానిబాలకుల..." (౧-౧౧౪)

"అంతట సిగ్గుదొంతరలె యాభరణంబులుగా వివేకముల్
శాంతము భక్తియుల్ దనవశంబులు గాఁగ హృదంతరంబునం
దెంతయుఁ బూజ్యభావమె యహీనవిలాసము గాఁగ సుప్రభా
కాంత యొసంగె భక్తిఁ దమకంబున నాతని కర్ఘ్యపాద్యముల్." (౧-౧౧౬)

మొదలగుపద్యములం దెంతనేర్పుతో వర్ణించినారో యంతకు మించిన నేర్పుతోడనే అష్టావక్రుఁ బరీక్షింపవచ్చిన ప్రౌఢాంగన కామోద్రేకసరససల్లాపములు (చూ. ౨-౫౮, ౬౨, ౮౨; ౩-౧౮, ౨౨) సైతము వర్ణించి ప్రౌఢకవితాచమత్కృతిఁ బ్రదర్శించినారు.

ఆయాప్రదేశముల వర్ణనలు గలపద్యము లతిమనోజ్ఞములుగా రచితము లయినవి. అందులకుఁ బ్రథమాశ్వాసారంభమునందుఁ గల "ఆదివ్యాశ్రమపుణ్యభూములను..." (౧-౮) మున్నగుపద్యము లెన్నియో చూడవచ్చును.

కావ్యమంతా హృద్యమైనదే. అతి మనోహరము లయిన పద్యములతోను, లలితము లైనభావములతోను, ఆదర్శప్రాయము లయినయాశయములతోను ఒప్పుచున్న యీసత్కావ్యమును రచించిన శ్రీవేంకటేశ్వరులుగారు ఇంకను నితోధికము లగుసత్కావ్యములు రచింతురుగాక! వీరిని భగవంతుఁ డాయురారోగ్యభాగ్యభోగ్యములనిచ్చి కాపాడుఁగాక!

ఇట్లు,

చెన్నపురి } గిడుగు వేంకటసీతాపతి.

# పురస్కారము.

విద్వాన్ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

"రసాత్మకవాక్యము కావ్యము"—"రమణీయార్థ ప్రతిపాదకశబ్దము కావ్యము" అని యాలంకారికు లనిరి. ఈనిర్వచనములలోని రహస్యము "అట్టి వాక్యముకాని శబ్దముకాని మొత్తముమీఁద నొక్కటియున్నను అది కావ్య మగు" నని. అట్టిచో, రమణీయార్థప్రతిపాదకశబ్దములతో నిండి రసాత్మకవాక్యములతో నొప్పుకావ్యము సత్కావ్య మనఁ జెల్లునుగదా !

ప్రకృత మీ 'అష్టావక్రచరిత్ర' మట్టి దగుట సత్యము. దీని కనేకనిదర్శనము లున్నవి. 'అంతట సిగ్గుదొంతరలె యాభరణంబులుగా' 'అసౌధంబుల దివ్యదేహముల సాహ్వానించె కాంతాజనంబు' 'నాసర్వస్వము నీవెసుమ్ము'. అనేకములుగా నున్న యిట్టిరసాత్మకవాక్యములు 'అష్టావక్రచరిత్రమునకు' సత్కావ్యముద్ర నొసఁగఁగలవు.

ఏతత్కావ్యకర్త శ్రీబులుసు వేంకటేశ్వర లాముష్యాయణులు. బులుసువారి పూర్వు లెల్లరు వేదవిదులు; షట్ఛాస్త్రకోవిదులు. "బులుసు లేని యజ్ఞము లే" దను మాట తెలుఁగునాట సుప్రసిద్ధము. క్షేమేంద్రుఁడు చెప్పినట్లు సత్కులీనత కవి కుండవలసిన ముఖ్యలక్షణములలో నొకటి. వేంకటేశ్వర్లుగారికరమువారు పూర్వులవలెఁ గాక యాంగ్లపుఁజదువులోనికి మాఱినను, ఆచారసంస్కారములందును, ఆధ్యాత్మికౌన్నత్యమునందును వీరు వీరిపెద్దలకుసైతము వన్నెఁదెచ్చి రనవచ్చును. అగుట, అష్టావక్రునిసద్ధర్మములు కవిగారిపట్ల నన్వయించునని నేను దృఢముగాఁ జెప్పఁగలను.

కావ్యము కవిహృదయమునకుఁ బ్రతిరూప మన్నవాదము సత్యమైనచో నీకావ్యమును జదివిన వీరియాచార్యభక్తి సువ్యక్త మగుట సత్యము. వీరిగురుభక్తి యప్రతిమానముగా నిందుఁ గానవచ్చుచున్నది. దీనికొన్న యితివృత్తము కవిచిత్త

వృత్తిని దెలుపును, కథ భారతామ్నాయములోనిది; పవిత్రతరమైనది. అంకితము గురుచరణములకు. ఆగురువులును 'యోగి, భోగి, సర్వకర్మత్యాగి యొకమాటె యైన సహజ పుణ్యాత్ములు'; ఇంకఁ గావ్యైదాత్త్యమును జెప్పనేల? కావ్యము గుర్వభివందనములతో నుపక్రమించిరి. "కవులై భక్తులునై మహామహిము" లైన శ్రీనాథ పోతనధూర్జటి ప్రముఖులఁ గైసేసిరి. అగుట ఈయన భక్త కవి యగుట తెల్లము. తఱచు గురుస్తుతి గావించినను గురునామాదులు పేర్కొనలేదు. "గురోర్నామ నగృహ్ణీయాత్" అని యేమో. (తృతీయాశ్వాసాంతమున 'సుబ్రహ్మణ్య చూడామణీ' యని మాత్ర మున్నది. వీరి గురువర్యుల పవిత్రనామాక్షరము లవియే యేమో!) మొత్తముమీఁద ఈకావ్యమునఁ గవిగురుభక్తి కరుడు కట్టిన దనఁజెల్లును.

ఈకావ్యకర్త ప్రాచీనకావ్యములఁ బెక్కింట చక్కని వ్యాసంగము కలవారనుటకు నుదాహరణము లున్నవి. 'అన్యకాంతలఁ దల్లులయట్లుగాఁగ', మున్నగు పద్యములు జీవరత్నములు. ఇట్టి రత్నాలంకృతమగు 'అష్టావక్రచరిత్ర' మాంధ్రభాషాయోష కమూల్యభూషణ మనుట స్వభావోక్తి.

"అంధ్రి" }

ఇట్లు,
మ. సత్యనారాయణశాస్త్రి.

# పత్త్రికాభిప్రాయములు.

1. ప్రశంసనీయమగు అష్టావక్రమహర్షి చరిత్రము మనోహరమగు ధారాప్రవాహముతో నామూలాగ్రముగా నడచినది..." భారతి, శ్రీరామకృష్ణప్రభ.

2. "ఉచితమగు ప్రబంధవర్ణనములతో సులభమై మృదుమధురముగా నుండునట్లు రచింపఁబడినది. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

3. "ఇందొక మహర్షి చరిత్రము చక్కనిశైలిలో వర్ణింపఁబడుట ప్రశంసనీయము..." ఆంధ్రపత్త్రిక.

శ్రీ

# అంకితము

నతమూర్ధంబున వాఙ్మనస్క్రియల నా
నందంబు సంధిల్ల మ
త్కృతికన్యామణి నీకుపాయనముగా
దేవా! మహాభక్తి నం
కితముం జేసి తరింప నెంచితిని శ్రీ
కృష్ణార్పితస్వాంతతా
శ్రితమందార! గురూత్తమా! ననుఁ గటా
క్షింపంగఁ జైకోఁగదే!

బులుసు వేంకటేశ్వర్లు.

శ్రీగురుభ్యో నమః.

# అష్టావక్రచరిత్రము

## పీఠిక.



దము లైనవిష్ణుపద
సేవనముల్ పరమార్థతత్త్వసం
పాదకముల్ మహోన్నతశు
భస్థితిమూలము లన్నసత్యసం
వాదము లేమహాత్మునిశు
భప్రదజీవితసౌఖ్య మైన వా
వేదవిదుం గురూత్తము న
భీప్సితసిద్ధికిఁ గొల్తు నిచ్చలున్. ౧

ఉ. శ్రీగురుదేవపాదసరసీరుహదివ్యమరందలబ్ధశో
భాగురుభాగ్యమే పరమపావనజీవనలక్ష్యభూతమై
భోగములేలయింద్రపదభోగములే తృణమాత్రమై మహా
యోగులునైతమందనిసుఖోన్నతి నందుటఁగొల్తుమద్గురున్. ౨

శా. శ్రీవాణీగిరిజాత్రయిం గడు శుభశ్రీవైదుషీజ్ఞానభా
గ్యావాప్తిం బొనరింప మద్ధృదయపద్మాంతస్థనుం జేసి మ
ద్భావోద్భాసులఁగా నొనర్చెద జగద్భద్రాను సంధాయులౌ
శ్రీవిష్ణ్వబ్జభవాష్టమూర్తుల నవిచ్ఛిన్నప్రమోదాప్తికై. 3

మ. తొలి కావ్యం బయి నిత్యనూత్నమయి సంతోషంబుఁ జేకూర్పఁగాఁ
బలుకుల్ భావములున్ మహోన్నతములై భాసిల్ల మాధుర్యమున్
గలనాదంబును మించ నింపెసఁగఁగాఁ గ్రమ్మ్రాత్మ నాదంబు న
ర్మిలి రామాయణకావ్యమున్ బలుకు వాల్మీకిన్ బ్రశంసించెదన్. ౪

చ. వినఁ జదువన్ స్తుతింపఁగను వీనులవిందును నేత్రపర్వమున్
ఘనతరమోదమున్ బరమకారుణికత్వ మొసంగఁ జాలు పా
వనతమ మైన భారతముఁ బ్రాప్తము చేసిన వ్యాసదేవునిన్
మనమున నెంతు నున్నతసమస్కృతులన్ భజియింతు నిచ్చలున్. ౫

శా. యోగానంతమహాప్రభావమున సంయోగంబుగా నెల్లెడన్
యోగబ్రహ్మము నాశ్రయించి పితరుం డోహో యనన్ సర్వరో
దోగోళంబు ప్రతిధ్వనింపఁగ మహాత్ముండున్ మహాయోగి యా
త్యాగిన్ శ్రీశుకు నిత్యమున్ దలతు మత్స్వాంతంబునన్ భక్తితో

చ. పుడమి సమస్తభాషలకు మూలము సంస్కృత మందు రందునన్
బొడమిన దివ్యకావ్యములు పూర్ణరసోదధు లౌను తత్కవుల్
కడు మహనీయు లన్నిటను గాన భజింతును వారి నెల్ల నే
నొడఁబడిపోదు వారల మహోన్నతదివ్యతపఃప్రభాళికిన్. ౭

ఉ. భారతసంహితన్ వివిధపర్వరసోదయ మేదురంబుగా
నేరుపుమీఱు భక్తి ద్విగుణీకృతశక్తి రచించి యాంధ్రభా
షారతి నన్నపార్యకవిచంద్రుఁడుఁ దిక్కన శంభుదాసు ల
వ్వారిపదంబు లంటి కడుభక్తిని మ్రొక్కెద సిష్టసిద్ధికిన్. ౮

మ. కవులై భక్తులునై మహామహిములై కారుణ్యపూర్ణాత్ములై
కవితానందసుధాప్రవాహమున నిష్కామంబుగా నీశ్వరున్
సవిలాసంబుగ నోలలార్చిన మహాసత్త్వార్థసంపన్నులన్
గవిరాట్పోతనధూర్జటిప్రముఖులన్ గైసేతు నెల్లప్పుడున్. ౯

చ. తెలుఁగు పవిత్రభాష; వినుతింపఁగఁజాలిన దేశభాషలన్
వెలుఁగు నతిప్రసిద్ధ మని విశ్రుతకీర్తుల దివ్యదీధితిన్
దెలుఁగుఁ గవిత్వ మెన్నఁగ నతీంద్రియతత్త్వవిచార మాకవీం
ద్రులు మునిశేఖరుల్ ప్రియముతోడుతఁ గొల్చెద వారినెల్లరిన్.

చ. నవరసపూర్ణముల్ పరమనవ్యములున్ హృదయానుమోదముల్
జవయుతజానసంగత యశస్కరముల్ బరమప్రబుద్ధ భా
గవతమహత్త్వవిస్తృతవిశేషకథాకమనీయకావ్యసం
భవకరులైన యాంధ్రకవిభాస్కరులన్ వినుతింతు నెంతయున్.

చ. కవి ఋషికల్పుఁ డౌట ఘనకావ్యము మానితపఃఫలంబుగా
వివరణచేయ నౌను సుకవిప్రభుదివ్యవచస్సమోఘమే
యవు నటు గానఁ గొల్చెద నహర్నిశముం సుకవీంద్రులన్ బరా
భవ మొనరింతు దుష్కవులఁ బ్రాప్తములై తగు నెల్లచేశలన్.

మ. అమలార్షప్రతిభాప్రభావసుమహత్త్వాంగీరసాయాస్య గౌ
తమమౌనీంద్రులు మాఋషిత్రయము; వేదప్రస్ఫుటోదారధ
ర్మమమత్వంబె నిరంతరోద్యమము సస్మద్వంశమర్యాదయున్
విమలాచారపవిత్రవర్తనమె మాపిత్రార్జితం బెన్నఁగన్. ౧౩

ఉ. పావనగౌతమీసలిలపానము స్నానము నిత్యకృత్యమై
జీవితముల్ ఋగధ్యయనశిష్యగణప్రవిబోధధర్మదీ
క్షావసరంబులై తపము సల్పి గడించిరి మోక్షలక్ష్మి నాం
ధ్రావని నాదుతండ్రియు నుదారుఁడు తాతయుఁ దాతతండ్రియున్.

చ. జనని సదాశివేంద్రవిలసద్బుధవర్యునికూర్మిపట్టి పా
వని యగు నన్నపూర్ణ; పితృపాదులు వేంటసుబ్బయాహ్వులౌ;
వినుతయశుల్ సహోదరులు వేంకటరామయ వేంకటేశ్వరుల్
చినయన సీతరాముఁడు వసింతురు నాకిటు మువ్వురన్నలై. ౧౪

క. ఆముష్యాయణుఁడను నే
నాముష్మికసౌఖ్యనిరతి నాచార్యార్చా
ప్రేమికుఁడ వేంకటేశుఁడఁ
గామేశ్వరి లలితహస్తకమలార్చితుఁడన్. ౧౬

ఉ. మామకభాగ్యదేవతగ మామకపూర్వతపఃఫలంబుగా
మామకరక్షకుండుగ నుమాపతిభక్తవరిష్ఠుఁ డైనపు
ణ్యామలకీర్తనీయకరుణాపరదివ్యమహర్షి సద్గురుం
డై మముఁగాంచవచ్చి కరుణామృతవృష్టినిముంచె మమ్ములన్. ౧౭

ఉ. ఆమహనీయు దివ్యకృప కాకర మైనమదీయభాగ్య మే
నే మని చెప్పఁగొందును గ్రహింపఁగఁ జాలఁ గృతజ్ఞతోక్తిఁగా
వ్యామలపద్మ మొక్కటి మహాత్మున కంకితమీయనెంచి నే
నామది నూహచేసి రచనం బొనరించితిఁ గావ్యరత్నమున్. ౧౮

గీ. భారతామ్నాయమున వనపర్వమందు
నానుశాసనికంబున నలరునట్టి
ఘనమహర్షి యష్టావక్రకథను గావ్య
ఫణితి వ్రాసితి లలితాంధ్రభాషలోన. ౧౯

గీ. నేఁటిపాశ్చాత్యవిజ్ఞాననీరధిఁ బడఁ
బ్రాచ్యవిద్యాసమార్జనపాటవంబు
సన్నగిలిపోవ జ్ఞానంబు సన్నగిల్లె
సన్నగిలిపోదె పాండితీసార మింక. ౨౦

ఉ. కావున మత్కవిత్వమునఁ గానఁగవచ్చు ననేకదోషముల్
భావవిహీనశబ్దములుఁ బ్రాజ్ఞతిరస్కృతవాక్యదోషముల్
కేవల మిన్నియుఁ విడువఁ గృత్యము విజ్ఞుల కింక భక్తిసం
భావనచేయఁగోరుదును భవ్యమునీంద్రుగుణంబు లెన్నఁడున్. ౨౧

మ. తనసర్వస్వముఁ బారమార్థికమహత్త్వానూనవిజ్ఞానసా
ధనకుఁ హోమ మొనర్చి సిద్ధిఁ గని నిత్యానంద నిర్మగ్నుఁడై
దినముల్ పుచ్చుచునుండు మద్గురువు నుద్దేశించి కేల్మోడ్తు నె
మ్మన మానందసుధాస్రవంతిని సుఖోన్మత్తంబునై తేలఁగన్. ౨౨

శా. ఏదివ్యర్షి ముఖావలోకనమహాదృష్టమ్ముమాత్రాన నే
దో దివ్యత్వసుఖమ్ము పైఁ బడఁగ నాదుఃఖాగ్ని చల్లారునో
యేదివ్యర్షిమహాప్రబోధధురి నాకెంతే మహాజ్ఞానభా
షాదీప్తిప్రద మాయె నట్టిగురు నశ్రాంతంబుఁ గీర్తించెదన్. ౨౩

మ. గురునామస్మరణామృతంబునమహాఘోరాఘసంతానముల్
హరియింపంబడు నిందు సంశయము లేదావంతయుంగానఁద
చ్చరణాబ్జంబులె నమ్మి యుండు నిఁక వాత్సల్యాతిరేకంబుచేఁ
బరిరక్షింపఁగఁ గొల్తు నాత్మగురుదేవబ్రహ్మచూడామణిన్. ౨౪

క. కరుణారసపరిపూర్ణుఁడుఁ
బరమానందప్రభూతభావన సుఖియౌ
పురుషునకుఁ సరసునకుఁ
నరహరిపూజానిమగ్న నవ్యాత్మునకున్. ౨౫

క. భోగియును సర్వకర్మ
త్యాగియుఁ నొకమాఱె యైనధన్యాత్మునకుఁ
యోగియును ముక్తివనితా
భోగియు నైనట్టిసహజపుణ్యాత్మునకున్. ౨౬

క. గురువునకు సర్వదుష్కృత
హరునకుఁ బరమాత్మఁ గన్న యమివర్యునకుఁ
బరమునకు భక్తితత్త్వా
విరళమహాదానదివ్యవీక్షాస్మృతికిన్. ౨౭

క. గానామృతనాదబ్ర
హ్మానందసుఖాబ్ధి నోలలాడించెడువి
ద్యానూనచక్రవర్తికి
మానీంద్రగుణాభిజాత మాన్యాత్మునకున్. ౨౮

క. నవరసభావనసర్వా
నవద్యునకుఁ బుణ్యునకు ననల్పశ్రీసం
భవునకు భవసాగరమం
దవలీలగఁ దేలియాడునట్టిబుధునకున్. ౨౯

క. సాక్షాదసంగహరునకు
విక్షేపత్రయము నెల్ల విడిచినఋషికిన్
త్ర్యక్షరవశవర్తికిఁ బ్ర
త్యక్షమహేశ్వరునకు విమలానందునకున్. ౩౦

క. అస్మత్సర్వమునకు ముర
ఘస్మరుదివ్యావతార ఘనరూపునకున్
భస్మావలేపనోత్సుకు
విస్మయహరిహరసురూప విబుధేంద్రునకున్. ౩౧

క. బ్రహ్మణ్యశిరోమణికిని సు
బ్రహ్మణ్యమహానుభావ పరమాత్మునకున్
బ్రహ్మణ్యలోకపతికిని
బ్రహ్మార్పణమతికిఁ బరమభవ్యాత్మునకున్. ౩౨

వ. హృదయపూర్వకనమస్కారపురస్సరంబుగా నాయొనర్పంబూనిన
యష్టావక్రచరిత్రమునకుఁ గథాక్రమ మెట్టి దనిన.



ఓం

# అష్టావక్రచరిత్రము

## ప్రథమాశ్వాసము.

---

### కథాప్రారంభము



రమ్యం బగుధర్మపద్ధతులు ని
శ్శేషంబు వాక్రుచ్చునా
కౌరవ్యోద్భవులు భీష్ముఁ గన్గొని తగన్
గాంగేయమూర్ధన్యుఁ "డో
కౌరవ్యోత్తమ ; నాకుఁ జెప్పఁగదవే
కన్యాప్రదానంబునె
వ్వారల్ పొందఁగ నర్హు"లం చడిగినన్
వాత్సల్యలక్ష్మీశుఁడై. ౧

శా. "ఇష్టార్థంబుల నీవిధం బెఱుఁగఁగా నిచ్ఛించుచో నీకు నే
నష్టావక్రచరిత్రఁ దెల్పుదుఁ దదీయాఖ్యాన మీ ప్రశ్నకున్
స్పష్టం బైనహితంబులే నొడువు విన్మా శ్రద్ధతో నీమనో
భీష్టంబా"నని చెప్పె భీష్ముఁ డపు డుప్పొల్గారఁ గాంగేయుఁడున్.

చ. "అది యొక కాననాంతరమహామహిమాస్పదపుణ్యభూమి య
భ్యుదయిమహామునిప్రకరపుణ్యతపఃపరిపాకదివ్యసం
పదలకుఁ దావలంబు నిజభారతదేశమహత్త్వతత్త్వసం
పదలకుఁ బుట్టినిల్లు తలఁపన్ భువిలోపలిస్వర్గసీమ యా. 3

ఉ. కన్నులపండువై ప్రకృతికాంత చరింపఁగ నైజరూపసం
పన్నత సర్వసౌఖ్యపరివర్ధక మైనప్రశాంతదివ్యభా
గోన్నతి నివ్వటిల్లు సమకూర్చు నిరంతర మాత్మతృప్తి య
భ్యున్నతదైవనిర్మితమహోత్తమపుణ్యవనప్రదేశముల్. ౪

గీ. ఆవనప్రాంతదివ్యమాహాత్మ్య మెమె
కడునిరక్షరు నైనను గవిని జేసి
పరమకల్యాణవిమలసంభరితమధుర
గీతికాలాపమగ్నసుకృతిని జేయు. ౫

చ. పరమసుఖాత్మకం బమలభావవిరాజితనిత్యనూత్న మా
వరవనికాంతరంబున భవంబును గాంచి మహామునీశ్వరుల్
పరముసుగూర్చి స్వీయఘనభాగ్యమహోదయులై త్యజింపఁ గాం
తురు క్షణికంబులై పరమతుచ్ఛము లౌనిహలోక సౌఖ్యముల్.

గీ. ఆవనాంతరభూమి సమాశ్రయించి
కొన్నిదివ్యాశ్రమములు నికుంజములును
మిగులనైపుణ్యమున వినిర్మించుకొనిరి
కొందఱుమునీంద్రు లొక్కటఁ గూడి మనఁగ. ౬

శా. ఆదివ్యాశ్రమపుణ్యభూములను నిత్యానందులై యుండి ని
ష్ఖేద బ్రహ్మపరాయణాత్ము లయి శుష్కీభూతసద్గాత్రులై
యాదితోపముల గ్రవంశజులు భార్యాపుత్త్రులంగూడి ధ్యా
నాదిస్వచ్ఛతపోగరిష్ఠు లయి సౌఖ్యంబుందు రెల్లప్పుడున్. ౭

ఉ. ఎచ్చటఁ జూచినన్ సమిధ లేఉమునీంద్రసుతప్రకాండులే
యెచ్చటఁ గాంచినన్ బనస లేకరువిచ్చుమునీంద్రచంద్రులే
యెచ్చటఁ గన్న నుజ్జ్వలితహేమరుచుల్ వెలిగ్రక్కువహ్నులే
ముచ్చటగొల్పు మానిజనమోహనజీవన మాశ్రమంబులన్. ౮

మ. ఒకనారీతిలకంబు సంతసముతో నొప్పారులేజింకకున్
వికసింపంగ ముఖాంబుజాతము లసత్ప్రీతిన్ దృశాగ్రంబులొక్కొ
కకొన్నింటినొక్కొక్క మాటిడఁగ నంఘ్రిల్ సాఁచి మేయన్ మహో
త్సుకతన్ వచ్చి గ్రహింపఁ గోరు నొకశార్దూలంబు వానిన్ వెసన్.

చ. అలసట నంది యొక్క హారిణాంగన వచ్చి మృగేంద్రుసందిటన్
వలసిననిద్రపోవ మునిబాల యొకర్తుక వచ్చి సింహమున్
దలపయి దువ్వుచున్ నిలువ నాకఁగ వచ్చును వ్యాఘ్రిబాల యా
సలలితబాలగాత్ర మది సన్నుతిఁ జూచుఁగ రేణుయూథముల్.

ఉ. ఆశ్రమపుణ్యభూముల విహారము చేయుమృగంబు లన్నిము
న్నాశ్రితవృత్తిమైఁ దమదినంబులు పుచ్చుచు నుండుఁగాని య
న్నాశ్రితజీవికన్ గడప వన్నము మాంసమె కాని యవ్వి దూ
రశ్రమ కోర్చి యేఁగి తిని రాఁ దొడఁగున్ ఘననిష్ఠ నిల్పుచున్.

ఉ. ఆవనవాసమందలిమహాసుఖముల్ గుఱుతింప రావు సం
భావన కంద వెన్నఁడు శుభప్రతిపాదకముల్ జగత్స్థిత
స్థావరజంగమాత్మకపదార్థవశీకరణప్రభావముల్
జీవితసార్థకత్వసవిశేషసుఖప్రదదివ్య హేతువుల్. ౧౩

గీ. నగరవాసంబులందుఁ గానంగనైన
క్రౌర్యకాఠిన్యకుటిలతల్ కానరావు
ఆత్మసంబంధులే కాని యంద అచట
నవమపృష్ఠాగతంపుబాంధవము లేదు. ౧౪

గీ. మునిశిరోమణు లందు ముముక్షువు లయి
జీవయాత్రల వెళ్లఁబుచ్చెదరు కాని
సారహీనసంసారకాంతారమందుఁ
గ్రూపమార్గములం బట్టి క్రుంగిపోరు. ౧౫

గీ. మునిసతీనివహంబు ముప్పొద్దులందు
శౌచలక్ష్మీనికాయంబుసరణిఁ దోఁచుఁ
బతుల నలరించు టనెడితపంబె వారి
కృశశరీరమనోజ్ఞతాకృతి ధరించు. ౧౬

గీ. మునికుమారసమాజ మెప్పుడును గూడ
నిత్యసంశుద్ధ మై పితృనివహమునకు
వలయుసంభారములఁ దెచ్చుపనులయందు
నధ్యయనమందు ధ్యానంబునందు నుండు. ౧౭

మ. పరనారీపరకాంచనాభిరతి యెవ్వారికిన్ గనంబోవ రా
దర మెవ్వారికి లేదు భౌతికసుఖత్వానందనిర్మగ్నతన్
వరణీయంబులు కావు భోగములు నిర్వాణప్రభాలక్ష్మియే
పరమార్థంబుగనున్న వారలమహత్త్వంబెన్న సామాన్యమే. ౧౮

ఉ. అందు వసించుమానిజనులందఱిలో మహనీయమానిసం
క్రందనుఁ డేకపాదుఁడు విరాజిలు దివ్యసతీమతల్లి దై
నందినభర్తృపూజల ననారతమున్ జగదీశ్వరార్చనా
నందసుఖాబ్ధిఁ దేలుచు మనంబుననొప్పుసుజాత భార్యగాన్. ౧౯

శా. శ్రుత్యుక్తప్రతికర్మనిర్వహణమే శుద్ధాత్మగేహంబునం
దత్యంతాత్మసుఖప్రదంబుగ జగన్మాన్యత్వమ్ముం గూర్చుదాం
పత్యానూనవిశిష్టయోగమున బ్రహ్మానందముం బొందువా
రత్యూర్జస్వలులై భజించిరి కుమారార్థంబు సర్వేశ్వరున్. ౨౦

క. ఈశ్వరకృప సోఁకుటయు ము
నీశ్వరకరుణాకటాక్షహితశోభితమా
నీశ్వరతరుణీరత్నము
శశ్వద్గర్భంబు దాల్చె శమదమయుతయై. ౨౧

క. చను మొనలు నల్లనయ్యెను
గను సన్నలు హెచ్చె లావు గనె నెన్నడు ముం
గన కంతకంత కద్భుత
ఘనుఁ డగు తనుజాతుపుట్టుకం దెల్పనసన్. ౨౨

శా. వేదాధ్యాపనమే తపోంగముగ భావించెఁ ముసీంద్రుండు స
ద్వేదాభ్యాసకుతూహలాత్ము లగునంతేవాసుఁ ర్థింపఁ దా
బోధింపంగఁదొడంగె వేదములు మాపుల్ రేపు నిట్లుండఁగాఁ
బ్రాదుర్భావమునందుబాలుఁ డివి నేర్వంగ న్గె గర్భస్థుఁడై. ౨౩

గీ. "స్వరము తప్పితి" వని తండ్రిఁ జక్కదిద్దు
"నేల రాత్రింబవళ్లు శిష్యాళిచేత
వల్లె వేయించి బాధింతు? వొల్ల" దనును
మాతృగర్భమునుండియే మాన్యుఁడగుట. ౨౪

గీ. ఏకపాదుండు సుతుపల్కు లాకలించి
మోహమును ద్రెంచి ధర్మప్రబుద్ధితోడ
"వక్రముగఁ బల్కె శ్రుతిఁ గూర్చి బాలుఁ డిట్టు
లష్టవక్రుండుగాఁ బుట్టు శిష్టుఁ డయ్యు." ౨౫

క. అని శపియించెను దనసుతుఁ
డనుపమసద్బుద్ధిశాలి యని యెఱిఁగియుఁ దాఁ
దనసుతుఁ డని విడిచినచోఁ
బనుపడఁడే ధర్మమార్గపదవీచ్యుతుఁడై. ౨౬

మ. నవమాసంబులు నిండె నంతటను గాంతారత్నమత్యార్తితో
ధవుపాదంబుల మ్రొక్కి "నాథ! కరుణాతాత్పర్యచిత్తుండ వై
తివి తైలంబు ఘృతంబు నాపురిటికై తేఁబోవవే సత్కృపా
"గవియాయా మిథిలాధినాథునడుగంగా నిచ్చుఁగా ద్రవ్యముల్"

క. అని ఘనదౌహృదభారం
బునఁ బలుకుసుజాతమాట ములుకయి హృదినా
టినఁ బయలుదేఱి వెడలెను
జనకాస్థానంబుఁ జేరఁ జయ్యన మునియున్. ౨౮

గీ. జనకునాస్థానపండితసభను "వరుణ
పుత్త్రుఁ డగువందిఁ గెలిచినపురుషవరున
కేది వలసిన నిచ్చెద వాద మందు
నోడిన జలమజ్జితుఁ డయి యుండవలయు." ౨౯

చ. అని జనకుండు పల్కినయంబును మెచ్చుచు నేకపాదుఁ డం
తన నిజపాండితిన్ వరుణనందనుతోడివివాదమందు నో
డిన వెనువెంటనే యతని డించిరి నీటను రాజసేవకుల్
చని వినిపించి రెవ్వరో సుజాతకు సర్వము నామె యంతటన్. 30

క. పతిఁ బాపినదుష్కృతమున
కతిదుఃఖము నంది దైవ మరయును ననునా
పతి యుండుఁగాక హారర
క్షితుఁడై క్షేమమున ననుచు స్థిరచిత్తమునన్. 31

క. దినములు గడపఁగ నొకనాఁ
డనుపమలగ్నంబునందు నాయమ ప్రీతిన్
దనయుని గనియెను వంకర
లెనిమిది గలవాని నొక్కహిమకరతేజున్. 32

క. అష్టాంగసుందరుండు త్రి
విష్టపసామ్రాజ్య మేలువిభవము గలవాఁ
డష్టావక్రుండయ్యెను
కష్టులశాపంబు లెంత చేయవు! ధరలోన్. 33

గీ. సరిగ నాలగ్నముననే సుజాతమాత
మౌనియుద్దాలకునిభార్య మాననీయుఁ
డైనపుత్త్రుని గనెఁ; శ్వేతుఁ డైనకతన
శ్వేతకేతుం డనెడిపేరఁ బెరుఁగుచుండ. 3౪

సీ. శ్వేతకేతుఁడె తనభార్తిగా నుద్దాల
కుండె తండ్రిగ నెంచుచుండి పెరుగు
చుండె నష్టావక్రుఁ; డొండొకదినమున
శ్వేతకేతుఁడు తండ్రి సెజ్జ నుండ
బాలుఁ డష్టావక్రుఁ డాలసింపక తాత
శిర మెక్కఁ జూచెడితరుణమందు
శ్వేతకేతుఁడు చాల చీకాకుపడి వాని
నడఁచి "పో! మీయయ్య కడకు" ననిన
చిన్నబోయిన మొగముతో సిగ్గువడుచుఁ
బరితపించుచుఁ దనతల్లి పదములంటి
"తండ్రి యెవరమ్మ నా"కన్నఁ దల్లడిలుచు
సుతున కెఱుఁగించెను సుజాత పతిచరిత్ర. 3౫

క. విని వినినంతనె "తండ్రిని
గొనివచ్చెదఁ బంపు"మనుచుఁ గొమరుండనముల్
ఘనధైర్యము సాహసమును
గనఁబడఁగాఁ దల్లియాజ్ఞఁ గైకొని యంతన్. 3౬

ఉ. బాలుఁడు మౌనిపుత్త్రుఁడు నృపాలునిపీటికి నేఁగి వందినిన్
గోలుమసంగఁ జేసి తనకున్ గడుఁగూర్చెడి తాతపాదునిన్
లీల గడించి తెత్తు నని నిర్భరమోదమునన్ గమించెనౌ
ద్దాలకమాతులుండు తనదండను రా మిథిలాపురంబుకై. 3౭

క. కడువేగంబున వచ్చెడి
బుడుతలఁ గని ద్వారపాలబుధు లాఁపఁగ వా
రడఁక "తడవొనరింపకుఁ
బుడమీశునిపాల వందిఁ బోకార్పవలెన్." ౩౮

గీ. అనుచుఁ బలికెడు బాలురయాననంబు
లగ్నిసందీప్తకంబులై యమరఁ జూచి
ద్వారపాలురు భయపడి వారిఁ గాంచి
"వృద్ధులే కాని బాలుర వెడలరాదు. ౩౯

గీ. జనకునాస్థానపండితసభకు మీరు
నాలుగై దేండ్లబాలురు మేలు గాదు
వందితో వాద మొనరింప వచ్చు టేల
మగిడి పొం"డన్న వా రనుమాన మెడల. ౪౦

క. "బాలుర వృద్ధుల నెన్నఁగఁ
జాలరు మీ రెవ్వరిందుఁ జాలింపుఁడు భూ
పాలకుఁ జూపుఁడు లేదా
పాలగుదురు మాదుశాపభవ్యాప్తి" కనన్. ౪౧

గీ. ద్వారపాలురు జనకభూపాలుతోడ
వే నివేదించి రా ప్రవృత్త మెల్ల
నాతఁ డచ్చెరువంది రమ్మనుటఁ జూచి
బాలురను నిల్పి రాభూమిపాలునెదుట. ౪౨

గీ. జనకుఁ డొకనవ్వు నవ్వి "యీఘనుల? వంది
గెలువ వచ్చినవా!" రని గేలిసేయఁ
బల్కె నప్పు డష్టావక్రబాలమౌని
మేఘగంభీరనినదంబు మిన్నుముట్ట. ౪౩

గీ. "జనకరాజర్షి వీవు విజ్ఞానశాలి
వనుచు విని యున్నకతమున మనములలర
వందితో వాదమున గెల్వ వచ్చినాము
కాని నీవిట్టిఁ డౌ టెఱుఁగంగనయ్యె. ౪౪

క. బాలురమఁట! విజ్ఞానులు
బాలుర? వృద్ధాప్యభారవహులా జ్ఞానుల్?
బాలుంజాలును నీ కిది
యేలా? కనరాదె వంది నెటు గెల్చెదవో. ౪౫

క. ఆపల్కులు విని జనక
క్ష్మాపాలుఁడు అచ్చువోయి గౌరవమున నా
పాపలఁ గూర్చొనుఁ డని
వేప్రశ్నల నడుగ చిత్రవిధమున నంతన్. ౪౬

క. అష్టావక్రుఁడు మృదువుగ
స్పష్టంబుగ క్షణములోన సర్వము దెలుపన్
సాష్టాంగ మెఱఁగి జనకుఁ డ
భీష్టం బది తీఱ వందిఁ బిలిపించుటయున్. ౪౭

గీ. పండితాఖండులులమౌళిల నిండుసభను
వాద మారంభమాయెను వందితోడ
ముక్కుపచ్చలె యాఱని ముద్దుబిడ్డఁ
డద్భుతంబుగ వాదింప నడరుటయును. ౪౮

మత్త. "అగ్ని యొక్కఁడె ప్రజ్వలించెడు నాకసంబున సూర్యుఁడు
ద్విగ్నమానసుఁ డొక్కరుండయి వెల్గుచుండును నిత్యముక్
మగ్నరహితుఁడు శర్వుఁ డొక్కఁడె మాన్యదైవము సృష్టిలో
భగ్న మనునది లేదు నా" కని వందిపల్కఁగ బాలుఁడున్. ౪౯

మత్త. "పర్వతుండును నారదుండును బ్రబలమిత్రము లిద్దఱే
సర్వభక్తుఁడు నింద్రుఁ డిద్దఱు సంచరింతురు మైత్రిచే
నిర్వహిల్లును నాలుమగలన్ నిఖిలసంసారంబులున్
ఇర్వు రాశ్వీను లుత్తమోత్తము లెన్ని చూడఁగ వెజ్జులన్." ౫౦

క. ఈవిధమున నొకటొకటిగ
నావాదమునన్ ద్రయోదశాంతస్సంఖ్యన్
వే వంది పలుకఁగా న
ష్టావక్రుఁడు యుక్తిఁ జెప్పి చతురతఁ గన్నన్. ౫౧

గీ. ఖిన్నవదనంబునన్ వంది క్రిందుమీఁదు
లరయఁ డోడఁగెను బైని మాటాడలేక
జయజయధ్వానముల్ నిండుసభఁ జెలంగె
జనకుఁ డెంతయుఁ గొనియాడె మునికుమారు. ౫౨

క. "జలమజ్జితు లగువిప్రుల
వెలువఱచుము క్షణములోనఁ బితృపాదులనా
కిలఁ జూపు వంది నింకన్
జలమజ్జితుఁ జేయు"మనుచు శాసించెన్నృపున్. ౫౩

గీ. వంది ముదమంది యెద నభినందనమున
మౌనిబాలకుఁ గొనియాడి మాననీయ
పితృయజ్ఞార్థ మామిష విప్రవరుల
వరుణలోకంబునకుఁ బుచ్చె నెఱుకపఱచె. ౫౪

మ. జనకుం డంతట నేకపాదుని సమర్చాపూర్వకప్రీతిఁ దో
కొనిరా నప్పుడు సభ్యులెల్లరును వాగ్గుంభప్రియస్తోత్రవా
హిని ముంచెత్తిరి తండ్రిపుత్త్రులను నెంతే నేకపాదుండు స్వ
స్తనయుఁ గౌఁగిటఁ గ్రుచ్చి మూర్కొనియె బాష్పప్రస్తనేత్రంబులన్.

గీ. రత్నఖచితాసనంబు లేర్పఱిచి భక్తి
సుతుని బితరుని నిలిపెను షోడశోప
చారములఁ బూజచేసెను జనకుఁ డంత
వేలుపులు మింటిపైఁ బుష్పవృష్టిఁ గురియ. ౫౬

క. కడుఁబసిబిడ్డఁడు జననముఁ
బడయకముందే గ్రహించెఁ బలువేదంబుల్
విడియించెఁ దండ్రి చెఱ సుతుఁ
బడయంగా నేకపాదుభాగ్యం బెంతో! ౫౭

గీ. సముచితంబుగ నందఱ సాదరాను
కూలవాక్యంబులన్ వీడుకొని సుతుండు
తోడరా నేఁగె నేకపాదుండు జనక
దత్తబహుధనధాన్యముల్ తగ గ్రహించి ౫౮

గీ. మార్గమధ్యంబునన్ ముని మాననీయ
బహుపవిత్రజలాకీర్ణ ప్రథమగణ్య
మగుసమంగానదిం గాంచి యందుఁ బుత్త్రు
మునిఁగి రమ్మని పంచి తాముందుఁ బోయె. ౫౯

క. అంగంబులు జలముల సోఁ
కంగన్ ముని గతఁడు లేచి కాంచెనె నిర్వ
క్రాంగంబుల నంగజభవు
నంగంబుల మించువాని నచ్చెరువడుచున్. ౬౦

గీ. తాతపాదునిసత్కృపాస్తత యటంచు
మెచ్చి గృహమున కేఁగి యమృతముఁ ద్రాగి
నట్లు సంతసించుపితరుల నలరఁ జేసి
యుండె నింట నష్టావక్రుఁ డుండ నిట్లు. ౬౧

చ. దినదినవర్ధమానుఁడు నుదీర్ణగుణంబుల ప్రోవు సత్కవా
గ్జనితవిధేయసంపద నజస్రము శోభిలుచుండువాఁడు నై
జనకునియొద్ద సద్గుణసంపద లంది వెలుంగుచుండ నా
తని నుపవీతుఁ జేసెఁ బిత తథ్యపువేదవిదుండు గావునన్. ౬౨

గీ. పెరటిలో నున్నకల్పక మురుఫలంబు
లొసఁగఁ జాల దటన్న లోకోక్తి నెంచి
శుభముహూర్తమునందు శిష్యుం బొనర్చె
ఘనమునీంద్రునకొకని కాతనిని దండ్రి. ౬౩

చ. ముదుసలి జ్ఞాని యైనమునిపుంగవు నాతఁడు చేరి గౌరవా
స్పదముగఁ బూజచేయుచు నుపక్రమణం బొనరించె శాస్త్రముల్
పదుగురమానిబాలకుల భవ్యులఁ గూడి సమభ్యసింపఁగా
విదితము గాఁగ నిత్యము వివేకము సంస్కృతి విస్తరింపఁగాన్. ౬౪

గీ. ద్వాదశాబ్దంబు లాతనిప్రాయ మయ్యెఁ
దోడివారల నిత్యసంస్తుతులు గనుచు
బ్రహ్మతేజమ్ము వెదచల్లు బ్రహ్మచారి
వినయమునఁ గొల్చు నేవేళ విబుధు గురుని. ౬౫

సీ. నియతవేళలయందు నిత్యసంధ్యావంద
నాగ్నిహోత్రాదుల నాచరించుఁ
బావనం బగునట్టిబ్రహ్మచర్యవ్రత
నిత్యకర్మకలాపనియతి నుండు
గురుదేవసేవాగ్ని పరితప్తసౌవర్ణ
దివ్యదేహచ్ఛాయఁ దేజరిల్లు
నైష్ఠికదీక్ష నహీనపద్ధతిఁ జూపు
యజ్ఞోపవీతసంప్రాప్తి వెలుఁగు

గీ. నమఃరవంద్యుఁ డష్టావక్రుఁ డరసి చూడ
శుకమహర్షి యో లేక సంశుద్ధుఁ డైన
వామనకుమారుఁ డేమొ ప్రభావమందు
నాఁగఁ దోఁచెడునట్టిపుణ్యాత్ముఁ డతఁడు. ౬౬

గీ. గురునిహృత్పద్మమును జూఱకొనె నతండు
వినయవిద్యావిశేషవివృద్ధివలన
నతఁడు సుస్థిరవిజ్ఞత నందువఱకు
విడువనని మౌని యాత్మలో విశ్వసించె. ౬౭

శా. అష్టావక్రమునీంద్రనందనుఁడు సమ్యగ్భక్తిసంయుక్తుఁ డై
సాష్టాంగం బొనరించు సద్గురునకున్ సర్వంబుఁ దా నేర్పుచో
నిష్ఠావాప్తికినై గురుండుఁ బరమాహీనస్థితిం గన్న యా
శిష్టాచారపరాయణాత్ముని వటుశ్రేష్ఠు న్నుతించు న్మదిన్. ౬౮

చ. గురుపరిచర్యలో మఱి యకుంఠితసద్వ్రతఘోరదీక్షలోఁ
బరమదయావిశేషమునఁ బావనధర్మమహావ్రతంబులో
నరమర లేనియాతనిహృదంతర మెంతపవిత్ర మైనదో
యొరుల కెఱుంగ రాక వెలయున్; గనరావు కదా మహాత్త్వముల్.

గీ. కామరోషాదిదుష్టరాక్షసగణంబు
లతనిదీక్షాగ్ని కింధనతతిగ వేలె
నతనికడ నిల్వ లేక లోభాధముండు
దవ్వదవ్వులకును దాన తరలిపోయె. ౭౦

గీ. శృంగములు కల్గువారలే చేర లేక
వే తొలఁగిపోయి రన నింక వేఱె పల్క
వలెనె మిగిలినదుష్టసంభవులమాట
నతఁడు శాసింప నేర్చె శత్రుతతి నెల్ల. ౭౧

సీ. తనజీవములు సర్వమును నొడ్డియైనను
గురున కేలోపంబుఁ బరఁగనీఁడు
తనదేహ మంతయు దహియించునే కాని
కామరోషాదులఁ గ్రాఁగనీఁడు
తననాల్క శితఖడ్గమునఁ గోయునే కాని
పరుషంబు లెన్నఁడుఁ బలుకనీఁడు
తనతపం బంతయు ధారపోయునె కాని
చీకాకుఁ దన చెంతఁ జేరనీఁడు
గీ. అతఁడు తినుటయు మనుటయు నతఁడు నిదుర
పోవుటయు నెవ్వ రెఱుఁగరు మునియనంగ
నతఁడె యతనికి సాటిపుణ్యాత్ముఁ డతఁడె
యతనిఁ గొనియాడఁ దలఁచు టే యఘహారంబు.

సీ. తనకంటి కెవ్వఁడైనను మునికన్యకల్
తగులుచోఁ బూజించుఁ దల్లులట్లు
తనదారి నెవ్వరైనధన్యాత్ము లొవృద్ధు
లెదురైనచో వారిపదము లంటుఁ
దనబుద్ధి కెపుడైనఁ దగు కాంక్ష పొడముచోఁ
బరమేశుకరుణయే పడయఁ గోరుఁ
దను నెవ్వరేఁ బొగడ్తలఁ బల్కనట వీడి
దవుదవ్వులకుఁ దాన తరలిపోవు
గీ. నతనిఁ బొడగాంచినంత బాహ్యప్రకృతియు
వివశయై యతనికి మహావినయమున వ
శీకృతం బగు నింక వశీకృతంబు
కానియది లేనియంతటిఘనుఁ డతండు.

సీ. గండుఁ గోయిలమృదుకలకంఠమును బోలు
సరణిని వేదంబుఁ జదువువేళఁ
జిలుకపల్కులఁ బోలుపలుకులఁ బలుకుచు
గురుదేవుమదిఁ జూఱకొనెడివేళఁ
బరమపావన మైన భక్తిభావముతోడ
శివసంస్తుతులు పెక్కు చేయువేళ
నమలినం బగునట్టి యంతరంగమునందు
గురుదేవుబోధముల్ కొనెడివేళ

గీ. నళినదండంబు లొప్పఁగా భుజమునందు
నొసట భస్మముఁ జేతఁ జిన్ముద్ర రతుష
పట్టుగోఁచియు మౌంజి శుభంబు లొసఁగ
నలరువేళలఁ గీర్తింతు రతని మునులు. ౨౪

చ. పరమదయాసముద్రుఁడు నపారతపోవిమలుండునై జగ
ద్భరితయశోవిశాలుఁ డగుభవ్యగురూత్తమునాదరంబుచేఁ
గరము పఠించెఁ దా వటుఁ డఖండముగా ఘనవేదశాస్త్రముల్
గురుకృప కల్గెనేని సమకూరని దేది ధరాతలంబునన్. ౨౫

గీ. మేఘగంభీరనినదంబు మించ వేద
తతి నుదాత్తానుదాత్తస్వరితము లొప్ప
నెచటఁ దడఁబాటు భ్రంశము లేమి లేని
విధముగా నేర్చె బ్రహ్మ మెప్పింప నతఁడు. ౨౬

గీ. అతనిగురుభక్తి కచ్చెరువంది గురుఁడుఁ
గ్రమముగా శీఘ్రమునను సర్వమును నేర్పె
నేర్చె నాతండు సర్వంబు నిశ్చలముగ
గురుకటాక్షంబ యెల్లఁ జేకూర్చుఁగాదె. ౨౭

గీ. గురుముఖంబున నేర్చుముఖ్యోపలబ్ధి
బ్రహ్మవిద్యాసమార్జనపాటవంబు
ననుపమాదర్శ మైనవిద్యాభివృద్ధి
నంది చెన్నారె నాతఁ డనంతశక్తి. ౭౮

మ. తనసాన్నిధ్యమునందు నెప్పుడు నమందానందసంధాయకుం
డును నిత్యప్రియవాక్యసంపద నిరాటోపప్రభావుండు నై
తనవిద్యాపరిపూర్తిఁ గన్నమునిపుత్త్రశ్రేష్ఠుతోఁ బ్రీతిఁ దా
ననియెన్ మానికులావతంసుఁడు ననన్యప్రేమ సంధిల్లఁగన్. ౭౯

చ. "కఱచితి వెల్లవేదములుఁ గాంచితి శాస్త్రమనీష నీ కికం
గఱపఁగ నే నశక్తుఁడను గావున నీవు గృహస్థధర్మమం
దఱమర లేకయుండుటకు నర్హుఁడ వైతివి సద్గృహస్థువై
వఱలుము నీదువర్తనము వాసిలు నింక నతిప్రసిద్ధమై. ౮౦

చ. అరయుము వైదికంబు లగునార్యమహోన్నతధర్మసంపదల్
పరిగణియింపు నిత్యశుచి బాంధవకోటికిఁ దృప్తిపూర్వమా
దరమునఁ బైతృకంబులును దైవఋణంబులు దీర్చుచుండి నీ
వరయఁగ రమ్ము ధర్మపరమార్థముసంశయ మైనవేళలన్. ౮౧

గీ. ఆశ్రమములందు సద్గృహస్థాశ్రమంబె
శ్రేష్ఠమనియండ్రుబుధులు విశేష మరసి
సద్గృహస్థులు లేనిదేశమ్ము వమ్ము
సద్గృహస్థులు కలుగుదేశమ్ము సొమ్ము. ౮౨

శా. ఏదేశంబున సద్గృహస్థనివహంబీశార్పితస్వాంత మై
వేదాభ్యాసిపటూత్తమోత్తముల కేవేళన్ సదాధార మై
నాదబ్రహ్మసుఖాత్మలోలగురుసన్న్యాసాంచితస్థాన మై
మోదాంభోనిధిఁ దేలుచుండు నదియే ముక్తీశ్వరస్థానమౌ. ౮౩

గీ. అత్రిగౌతమభృగు వసిష్ఠాదు లెల్ల
ధర్మనిలయం బయినగృహస్థాశ్రమంబె
యాశ్రయించి వెలింగి; రయ్యది గ్రహింపు
వారె యాదర్శ మాదు రెప్పటికి మనకు." ౮౫

చ. అని గురువర్యుఁ డన్న వినయంబునఁ బాదతలంబు ముట్టుచుం
గనుఁగొనలందు బాష్పములు గ్రమ్మఁగ ధైర్యమహాధనంబుచే
ననుపమకాంతితో నలరునాననపద్మము వంచి మెల్లఁగా
నను గురుదేవుతోడ వినయంబు భయంబును భక్తి మించఁగన్.

చ. "ఇరవుగ లోకవర్తన మొకింతు కెఱుంగ గురూత్తమాంఘ్రిపం
కరుహవిశేషదాస్య మది కాక తదన్యము నట్టి నన్ను మీ
రరయ కెఱింగిపంపనగునా కడుదుష్కరగేహధర్మభీ
కరపథవర్తనంబునకుఁ గాంచరె మామకరక్షణీయతన్." ౮౬

గీ. అని పలుకుశిష్యు గురుఁడుఁ బ్రేమార్ద్రదృష్టిఁ
గాంచి "వత్స ! నే నెఱుఁగనా ? కార్యమిదియ ?
యగు నమోఘంబు నాదువాక్యంబు వినుము
దాఁటఁ జూడకు మెపుడుఁ బెద్దల" నటన్న. ౮౭

గీ. "మీవచస్సమోఘంబు క్షమింపుఁ డేను
దెలియ కంటిని కొన్ని సందేహకరము
లైనవాక్యముల్—మీరలే యానతిండు
తగినకన్నియ యెవతె యుద్వాహమునకు. ౮౮

గీ. గురునియానతి దాఁటుమూర్ఖుఁడను గాను
మీకటాక్షసుధారసామేయశక్తి
నిర్విచారుఁడ నై యుందు నిశ్చయముగఁ
దెలియఁ జెప్పుఁడు నేఁ జేయఁ గలది దేవ !" ౮౯

చ. అనవుడు నొక్కసారి హృదయంబున దృష్టి నిగుడ్చి వెంటనే
మునివరుఁ డిట్లు పల్కె నను మోదముతోఁ బ్రియశిష్య! వత్స! పా
వనుఁడవు నీవు నీకుఁ దగువాఁడు వదాన్యుఁడు నామహామునీ
శునిసుకుమారి సుప్రభ యశోమయి నీకతగుం గుమారకా! ౯౦

గీ. ఆమునీంద్రునికడ కేఁగి యభిమతంబుఁ
దెలియఁ జెప్పుము నాదుపల్కులుగ నీవు
నాతఁడును నిన్ను గ్రహియింప ననుమతించుఁ
బోయి రమ్మిఁక శుభములు పొందు" మనిన. ౯౧

గీ. గురునిపాదంబులకు భక్తిపరత నెఱఁగి
దీవెనల నంది కోర్కె సిద్ధించుకొఱకు
బయలుదేఱె నష్టావక్రవటువరుండు
నావదాన్యనియాశ్రమోపాంత మరయ. ౯౨

గీ. రాత్రిభాగంబునను గురురత్నముకడ
శిక్షఁ బడయుచు నజ్ఞాతసేవ చేసి
పద్మినీకాంతహృదయంబుః బట్టవచ్చు
బాలభానునిరీతి నొప్పారె నతఁడు. ౯౩

గీ. కోరకంబుగఁ గాలంబుఁ గొంత కడపి
నవనవస్ఫూర్తి భాసమానమ్ము గాఁగ
నభ్యుదయ మందుకుసుమము ననుసరించె
నావటూత్తము బ్రహ్మచర్యప్రదీప్తి. ౯౪

గీ. కడపవలసినజీవితకాలమందుఁ
బ్రథమ మైనట్టిబ్రహ్మచర్యాశ్రమంబుఁ
గడపి యాతఁడు గార్హస్థ్యకలనఁ దనర
నావదాన్యునిఁ గాంచంగ నరుగునపుడు. ౯౫

ఉ. అందము మీఱ వీచె మలయాచలనవ్యసమీరపోతముల్
మందము మంద మై ముని యమందసుఖానుభవంబు నంది యా
నందము నంద శ్రావ్యశుకనాదము తోఁచెను స్వస్తివాక్య మై
ముందర వచ్చుపెండ్లి మునుముందర నే గ్రహియించినట్టు లై. ౯౬

క. ఇరువురుఋషికన్యక లం
బురుహానిభాననలు నవ్యఫుల్లాబ్జంబుల్
కరసరసిజముల మెఱయఁగ
నరుదెంచుచు నెదురువచ్చి రావటుమణికిన్. ౯౭

చ. శుభశకునంబు నూఁతగొని స్తోత్రకదంబముచే గురూత్తముం
డభిముఖుఁ డైన సంతసము నందుచు మిత్త్రుల వీడుకొల్పి హృ
న్నభమున దేవదేవు శరణంబని రక్షకుఁ జేసి మారస [కిన్.
న్నిభుఁడు వటూత్తముండు పయనించె వదాన్యగృహోపభూమి

గీ. ఆతనియెడఁబాటు నోర్వలే కచట గురుఁడు
"నిట్టివి గదయ్య బంధమ్ము లెవనికైన—
చూచి యెఱుఁగ నే నిట్టి శిష్యుఁ ధరిత్రి"
ననుచుఁ జెప్పంగఁ దొడఁగె శిష్యాలితోడ. ౯౯

గీ. నవనవోన్మేషయౌవనానంద మెవనిఁ
బరవశునిఁ జేసి ముప్పుతిప్పలను బెట్టు
దెవనిపాండిత్య మది గర్వ మీఁకయుండు
నతనిభాగ్యముఁ గొనియాడ నలవి యగునె. ౧౦౦

గీ. అతఁడు పొడగాంచవలసిన యావదాన్యుఁ
డనుపమానతపశ్శాలి యద్వితీయ
గార్హ్యధర్మప్రపాలనాగౌరవుండు
నాత్మతత్త్వజ్ఞుఁ డైనపుణ్యప్రభుండు. ౧౦౧

గీ. పరిసరారణ్యభూమి నివాస ముండు
లక్షణాన్విత యైనయిల్లాలితోడ
సుప్రభానామలసితయాసుతను గాంచి
యుత్తమాదర్శజీవితవృత్తి నతఁడు. ౧౦౨

గీ. ఆయరుంధతితో ననసూయతోడ
నతివ పోలు నటన్నఁ గా దతిశయోక్తి
సుగుణపుంజంబు పతిమతిఁ జూఱకొన్న
ధర్మదేవత యగును వదాన్యుభార్య. ౧౦౩

గీ. కమ్మతావుల నీను నెత్తమ్మిఁ బోలు
స్వచ్ఛశారదపూర్ణిమాచంద్రుఁ బోలు
ముఖవిలాసముఁ గల్గినముత్తియంబు
సుప్రభాకన్య సౌందర్యశోభితాంగి. ౧౦౪

చ. జనకునిపాదపద్మము లజస్రముఁ గొల్చుచు భక్తియుక్తి నా
తనికి సపర్య లెల్ల సతతంబు నొనర్చుచు మాతృదేవికిన్
వినయవిధేయతాన్విత వివేకగుణంబునఁ బ్రీతిఁ గూర్చుచున్
మనములరంగఁజేయుచు నుమాసతిసుప్రభ గొల్చునెప్పుడున్. ౧౦౫

గీ. అతిథు లేతేర నర్ఘ్యపాద్యంబు లిచ్చు
మాననీయులపాదపద్మములు గొల్చుఁ
బుణ్యసాధ్వులపూజ లెప్పుడును జేయు
సుప్రభాకన్య యాజన్మసుగుణ యగుచు. ౧౦౬

చ. పదిపదునాల్గువర్షములప్రాయము వచ్చియు రాకమున్నె సం
పద లన నెట్టివో పరమమాన్యపదంబు గ్రహించు టెట్టులో
సదమల మైనసంసరణసాగరనిస్తరణాతిసౌఖ్య మె [యున్.
ట్లొదవునొ యన్నప్రశ్నముల కుత్తరముల్ గ్రహియించె నామె

సీ. పరమేశ్వరుని దైనప్రతిబింబమే భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని
నఖిలసంపదలకు నాలవాలము భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని
నుభయవంశోద్ధారుఁ డుత్తముండగు భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని
నైహికాముష్మికాద్యఖిలప్రదుఁడు భర్త
పడఁతి భజింపంగవలయుఁ బతిని

గీ. నట్టిపతిదైవ మెట్టి యిక్కట్టులందు
మాననీయుఁడు త్రాశయు మహితవిభవ
శోభితుం డనువిశ్వాసశోభ నంది
సుప్రభాకన్య వెలయు సంస్తుత్య యగుచు. ౧౦౮

క. జననీజనకుల శుభద
ర్శనమున మేల్కాంచి వారిశశ్వదోప్రభం
బును శిరమున ధరియించుచుఁ
గను నామోదంబు జననిగాంచినఫలమున్. ౧౦౯

గీ. తల్లిదండ్రులు కడపునాదర్శజీవ
నంబు, నంతర్బహిరరాతినాశనంబు
నాత్మవిద్యానపేతసౌఖ్యానుభూతి
నాకళించెను సుప్రభ యన్ను మిన్న. ౧౧౦

గీ. ఆవదాన్యునియాశ్రమప్రాంగణమున
కరుగుదెంచి యష్టావక్రుఁ డరయ నచట
జనకునానతి భక్తిబుష్పములు కోయు
సుప్రభాకన్య కనరాఁగఁ జోద్య మందె. ౧౧౧

గీ. కొమ్మ కొమ్మను వంచి సుమమ్ముఁ గోయఁ
గొమ్మలందొక్కకొమ్మయై కొమ్మ తోఁచె
సుమముఁ గోయఁగ నెంచు నాయమ కరంబు
సమలమార్దవవిఖ్యాతసుమముఁ బోలె. ౧౧౨

గీ. ప్రసవమును గోయునట్టిసుప్రభకరంబు
తనదు హృత్పద్మమును గోసి తనరునట్లు
తోఁచె నాబ్రహ్మచారి కస్తోక మైన
యతనితేజంబుఁ గాంచి యాయమయు నంత. ౧౧౩

ఉ. "కంటిని మౌనిబాలకులఁగాంచనసన్నిభదివ్యదేహులన్
గుంటిని వారిసోదరి ననం దగి తొల్లి యనేకవేళ లే
నుంటి నతిప్రియంబున నొహో యితఁ డేల కలంచె నామనం
బొంటి నిటుండ" నన్న తనయూహలతోఁ జని చెప్పెఁ దండ్రికిన్.

గీ. దవ్వుననె వానిఁగాంచి వదాన్యుఁ డెల్ల
నాత్మగతమున నెఱిఁగి యాహ్లాద మంది
యర్ఘ్యపాద్యమ్ము లిమ్మని యనిపె గూఁతు
సుప్రభాకన్య నది శుభసూచకముగ. ౧౧౪

గీ. మునికుమారునిరాక సమ్మోద మొసఁగ
నతనిఁ గూర్చుండఁ జేసి యత్యాదరమున
"సాగుచున్నవె చదువుసంజలు క్రమమున
గురులు సేమమే?" యని వారికుశల మడిగె. ౧౧౫

ఉ. అంతట సిగ్గుదొంతరలె యాభరణంబులుగా వివేకమున్
శాంతము భక్తియున్ దనవశంబులు గాఁగ హృదంతరంబునం
దెంతయుఁ బూజ్యభావమె యహీనవిలాసము గాఁగ సుప్రభా
కాంత యొసంగె భక్తిఁ దమకంబున నాతని కర్ఘ్యపాద్యముల్.

గీ. ఆదరంబునఁ గైకొని యావటుండు
"శీఘ్రమేవ వివాహసంసిద్ధి రస్తు"
టంచు దీవింప నలరె నాయమయు లోన
నావదాన్యుఁడు ముదమందె నది యెఱింగి. ౧౧౮

ఉ. "పావన మయ్యె మాగృహము పావన మైనత్వదీయపాదసం
భావన నోవటూత్తమ! శుభంబులె మాకికఁ గల్గు నెప్పుడున్
నీవు మహాప్రశస్తుఁడవు నిక్కము మామకపూర్వపుణ్యమే
నీ విట రాఁ గతం బగుట నిశ్చయ మిం తని నే నెఱుంగుదున్.

చ. వయసునఁ జిన్నవాఁడవు ప్రభావమునం గడుఁబెద్దవిందు సం
శయ మది లేదు నే నెఱుఁగఁ జాలితి మీగురుదేవునొద్ద నీ
నయమును భక్తియున్ భయము నశ్రుతపూర్వము నేఁడు నీదురా
కయె పదివేలు నీదయిన కార్యము చెప్పుమసంశయంబుగన్." ౧౨౦

గీ. అని వదాన్యుఁడు పలుక నావంత యైన
స్తుతికి గర్వంబు నొందక స్తోక మైన
వినయము వివేకమును భక్తి విశదపడఁగఁ
బలికె నిట్లు వదాన్యుతోఁ బ్రస్ఫుటముగ. ౧౨౧

శా. "ఆశీర్వాదము నంద మీకడను నే నర్హుండనే కాని మీ
వైశిష్ట్యస్తుతి కెంతమాత్రమును నేఁ బాత్రుండఁగా నింకస
ర్వాశామోహవిలోభబంధురమహాపాశచ్ఛిదానందులున్
సౌశీల్యప్రభు లట్టిమీపదనఖాంశం బేను బోలం గదా. ౧౨౨

గీ. ఇంత కస్మద్గురూత్తము లిట్లు పల్కు
మనిరి తముతోడ నుత్సాహ మతిశయిల్లఁ
'బ్రభల నీనెడుమీదుసుప్రభ నితనికిఁ
బరిణయంబుగ నీయ నాప్రార్థనంబు. ౧౨3

గీ. మీఁదుమిక్కిలి యోజించి మిమ్ముఁ జెప్పు
మనిరి దీని విచారించి యభిమతంబుఁ
దెలియఁ జెప్పిన నేఁ బోయి తెలియఁ జెప్ప
నస్మదీయగురూత్తము నభిమతంబు." ౧౨౪

చ పలుకుటయుఁ వదాన్యుఁ డతిభవ్యచరిత్రుఁడు సంతసంబుతో
నలఁతియె సద్గృహస్థునిగృహాంగణభూమికి నేఁగుదెంచి పూ
జ్యులకును బూజ్యుఁ డైనపురుషోత్తముఁ డిట్లు తనూజఁ గోరి రాఁ
గలదె మఱొక్కభాగ్య మని కౌతుకమందుచు వాని కిట్లనున్.

ఉ. "నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వెల్లగుణంబులందు సం
భావితపుణ్యమూర్తివి శుభాకర! నీకును మాదుసుప్రభా
దేవికి నీడు జోడు మఱి దివ్యగుణంబుల సామ్య మౌను శో
భావహ మిద్ది కాని వినుమా మదభీష్టము పాటిసేయఁగన్."

క. అన విని యష్టావక్రుఁడు
మనమున ననుమానరహితమానితశాంతిన్
వినయమునఁ బల్కె నిట్లని
"పనిగొనియొకఁ దెల్పుఁ డెంతపని యైన నికన్." ౧౨౬

చ. అనిన వదాన్యుఁ డిట్లనియె సంత "నుదీచ్యపథంబునీవుప
ట్టిన నది పోవు నొక్క ప్రకటీకృతదివ్యసుగంధపూరకా
ననమున కద్ది దాఁటి చనినన్ వినుమొక్క పురాధిరాజ మిం
పున విలసిల్లు నద్దియె ప్రభుం డగునట్టిధనేశుప్రోలు నై. ౧౨౭

ఆ. ధనదుపురము దాఁటి ధర్మాటవిం దాఁటి
పోవఁ బోవ వచ్చు పురవరములు
వాని దాఁటి పోవ వచ్చును గిరు లింక
నరిగి పిదపఁ గను హిమాలయంబు. ౧౨౮

చ. పరమపవిత్ర మాగిరి ప్రభావమునం గడుమిన్న పూర్వమా
గిరితటపుణ్యభూమిని మృగేక్షణ యాగిరికన్య యీశ్వరుఙ్
వరునిగఁ గోరి చేసిన దవారితపద్వ్రతదీక్ష చాతఁడుఙ్
బరమదయాళుఁడై పరమపావని యాగిరికన్యఁ గైకొనెన్. ౧౩౧

చ. అదియునుగాక యానగమహత్త్వ మనంత మనూహ్య మందు సం
పదల విరాజిలుఙ్ బ్రమథభవ్యగణంబులు క్రీడసల్పుచుఙ్
ముదమునుఁబొందుఁ బార్వతిప్రమోదవనమునందు మృడుండు భక్తిన
య్యుదన మునీశ్వరుల్ నిజహృదంబు జనుల్వికసింపఁ గాంతురున్.

గీ. ఆపవిత్రప్రదేశమాహాత్మ్య మరసి
గిరిజ సేవించి మృడుని సుగీతవితతిఁ
గీర్తనము చేసి యొక్క ముహూర్త మాఁగి
కడచి చన నొక్కచో నీపకాననంబు. ౧౩౨

క. కన్నులకును బండుగ యై
యన్నులకును బ్రియసమాగమావాసం బై
చెన్నొందవు నట్టి కానన
మెన్నం గనఁ జాల మెట్టిరొడలఙ్ జగతిన్. ౧౩౩

గీ. ఆవనాంతరనగరంబు నాశ్రయించి
దివ్యతేజఃప్రభావసద్విభవ మంది
యువతి యొక్కతె పుణ్యాత్మ యుండు నామెఁ
గాంచి వచ్చిన దీరు నాకాంక్ష లెల్ల. ౧౩౪

క. వచ్చినవెంటనె నీకును
నిచ్చెద సుప్రభను బరమహృష్టాత్ముఁడ నై
వచ్చినవరుఁడవు నీ వని
మెచ్చును సుప్రభయు నింక మే లగు నీకున్." ౧౩౫

క. అని యేర్పరించి పలికిన
విని యష్టావక్రుఁ డంత వినతాననుఁ డై
"కని వత్తుఁ బోయి వచ్చెద
ననుమానము లే" దటంచు నతఁ డరిగె వెసన్. ౧౩౬

## ఆశ్వాసాంతము.

ఉ. ఉత్తమభక్తలోకపరమోత్తమ! సద్గురుదేవ! తావకీ
నోత్తమపాదపద్మసరసోత్తమసేవ ననుగ్రహింపుమో
యుత్తమయోగివంద్య! పురుషోత్తమభక్తవతంస! సర్వలో
కోత్తరదివ్యతేజ! పరమోత్తమభావ! జగత్ప్రభూత్తమా! ౧౩౭

పంచచామరము :

సురాధినాథు లెన్న లేనిశుద్ధతత్త్వసంపదన్
విరాజమానదివ్యకీర్తివిశ్రుతప్రభావుకా!
కరావలంబ మై మదీయకాంక్ష లెల్లఁ దీర్చి త్వ
త్సురాపగాజలంబునందుఁ జొక్కఁ జేయు సద్గురూ! ౧౩౮

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వగౌతమ
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్ర వేంకటసుబ్రహ్మణ్యేశ్వ
రాన్నపూర్ణాదేవీ చతుర్థపుత్త్ర బులుసు వేంకటే
శ్వరప్రణీతాష్టావక్రచరిత్రమునందుఁ
ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# అష్టావక్రచరిత్రము

## ద్వితీయాశ్వాసము.



జయియు ముక్తిలక్ష్మీ
రాజితమహిమాభిరాము రమ్యాకారుం
దేజస్సంపన్నుని గురు
రాజేంద్రుని సంతతంబుఁ బ్రార్థింతు నెదన్. ౧

వ. అన విని దేవా! యజాతశత్రుఁ డాపిమ్మట నష్టావక్రుఁ డెట కేఁగె నేమి చేసె ననుటయు భీష్ముం డిట్లని చెప్పఁదొడంగె ౨

చ. చని చని కాంచె నాతఁడు విశాలతటాంతరసన్వికాసపా
వనజలసంయుతంబు సురవంద్యసుఖాస్పదదివ్యవీచికా
నినదవిరాజితంబు నతినిర్మలశాంతవిభాసితంబు స
న్మునిగణసేవితంబు ఘనమోహహరంబగుబాహుదానదిన్. ౩

చ. చలదురువీచికాచయము శాంతసుఖప్రద మై సదా మనం
బలరఁగఁ జేయ నందలిమహత్త్వసుఖంబును జూచుకొంచు భూ
తలమున నున్నపచ్చ నగుతావులు మోదము నిన్మడింపఁగా
సలలితమానసంబు విపశంబుగనిల్చె నతండు నాఁటికిన్. ౪

గీ. బాహుదాతీరభూభాగవర్తి యగుచు
బాహుదానీరములఁ గ్రుంకి పరమహర్ష

జలధి నోలాడి మునివంశతిలకుఁ డంతఁ
బోవఁ దొడఁగె ధనాధీశుప్రోలివైపు. ౫

చ. నిరతము బ్రహ్మచర్యఘనసిష్ఠఁ ద్రిశుద్ధిగ నిల్పి యుంట స
ద్గురుపదసేవయుక్ నిగమఘోష త్రికాలము నుండియుంట నీ
శ్వరుని మనంబునందు నతిభక్తి వశీకృతుఁ జేసికొంటనా [గన్.
పరమమునీంద్రు ప్రత్యణువు బ్రహ్మమయంబుగఁ దోఁచుచుండఁ

గీ. బాలరవి జ్ఞానదీప్తులఁ బఱపునట్లు
బాలముని బ్రహ్మదీప్తులఁ బఱపుచుండె
బాలభానుండు దివ్యసంప్రభవుఁ డగుట
బాలముని దైవసద్గుణప్రభవుఁ డయ్యె. ౭

చ. ధనదుని మున్నెఱింగినకతంబున నాతనిప్రోలుఁ జూడఁగాఁ
గనుట శుభప్రదం బని సుఖంబుగఁ బోవుచు నుండ దవ్వునన్
ధనదుఁడు వానిరాకను బ్రధానులుచెప్ప నెఱింగివెంటనే
తనదు విమానముం గొని ముదంబున వచ్చె మునీశుపాలికిన్. ౮

ఉ. మచ్చిక మీఱఁ దోడనె విమానము డిగ్గి యథోచితంబుగా
వచ్చి నమస్కరించి మునివంశవరిష్ఠునిఁ గౌఁగిలించి "యో
సచ్చరితా! కృతార్థుఁడ విశాలయశోధన! నాదువీటికిన్
వచ్చితి వీవు నాదయినభాగ్యపరంపరకున్ ఫలంబ వై. ౯

గీ. స్వాగతము స్వామి! హృదయపూర్వాభినంద
నము లధివసింపు మీవిమానంబుఁ గరుణ
నధివసించి గృహంబున కరిగి యచట
బడలికలువాయ మాటాడవచ్చుఁ బిదప. ౧౦

క. అని వేఁడుకొనియె నాతని
మన మెఱిఁగినయావటుండు మా ఱాడక యా

తనికోర్కెఁ దీర్పఁ ద్రిభువన
వినుతంబుగ వాహనోపవిష్టుం డగుటన్. ౧౨

క. కను మూసి తెఱచునంతనె
వినువీథిని వచ్చి చేరె విద్యుద్వేగం
బున నావిమానరాజము
ధనదునిపురజనులు గాంచి ధన్యులు కాఁగన్. ౧౩

చ. అది యలకాపురంబు పరమాద్భుతదృశ్యవిరాజితంబు సం
పదలకు మూలమున్ నిఖిలభాగ్యసుఖాస్పద పుణ్యభూమి భో
గదమహిళాజనంబులకు ఖ్యాతిగడించినచోటు నిత్యస
మ్ముదమున యక్షకింపురుష ముఖ్యులు వేడుకఁగూడు తావునన్.

సీ. ఏవంకఁ జూచిన నింద్రనీలవినూత్న
సంస్థాపితం బైనసౌధచయము
లేదిక్కుఁ గాంచిన నింపైనమధుమాస
ప్రకృతిశోభల నీనుప్రకృతిశోభ
లేకడఁ బొడగన్న ప్రాకటసౌందర్య
రాజితం బైనయారామవాటు
లేదెస నెంచిన నినుమడించినపరి
మళమంజులము మందమారుతములు

గీ. దివ్యగాయనీగాయకోత్కృష్టమధుర
గానలహరీప్రసిద్ధశృంగారబహుళ
రససమాకృష్టమోహవిరాజమాన
భోగనారీవిలాసవిస్ఫూర్తి వెలయు. ౧౪

ఉ. అందలిదివ్యసౌధములయందుఁ బ్రసిద్ధికి నెక్కె యెంతయున్
సుందర మైనసౌధము శోభితనవ్యవిలాసినీజనా

నందనిధాన మొక్కటి సనాతనమౌని విహారవాసన
స్మందిరముగాఁ బొనర్చెను ధనాధిపుఁడేమి మదిఁ దలంచెనో. ౧౫

శా. ఆసాధంబున దివ్యదేహముల నాహ్వానించె కాంతాజనం
బాసౌందర్యనిధానముగా ఘనతపస్స్వాధ్యాయవిద్యానిధిన్
వీసం బైనఁ జలింపఁ డాతఁడు మహావిద్యానిరూఢస్థితిన్
గాసం బైనఁ గదల్పఁ జాలరుగదా గాఢవ్రతుం గామినుల్. ౧౬

శా. అష్టావక్రునినిష్ఠ మున్వినె ధనాధ్యక్షుండు సంప్రీతినా
విష్టుండైన గురూత్తముండు పలుకన్ విన్నంతనే పోక తా
నష్టావక్రుఁ బరీక్ష చేయువల నత్యంతంబుఁ గాంక్షించె న
య్యష్టావక్రుఁ డెఱుంగఁడీ విషయ మీర్ష్యాగ్రస్తు లింతేకదా! ౧౭

ఉ. ఇయ్యదికారణంబుగ ధనేంద్రుఁడు వారవధూజనంబుతో
నెయ్యము మీఱ నెంతయును నేర్పునఁ జెప్పె ముదంబుమీఱ "నో
తొయ్యలులార! మీ రతనితోడఁ జరించి జయింపుఁ"డంచుఁ దాఁ
దియ్యఁగఁ బల్కె సర్వము మదిన్ దలపోసె జయింప నాతనిన్. ౧౮

గీ. ఈపరీక్ష నష్టావక్రుఁడే జయింప
నగును సంతస మాతనియాత్మనిష్ఠ
కతఁడు జితుఁడైన నానంద మగును దనకు
నభిమతము తీరు నని ధని యాత్మఁ దలఁచె. ౧౯

గీ. ధనదుఁ డాతని భక్తిఁ బ్రార్థనము చేసె
నొక్కవత్సర మాఁగి యం దుండుటకును
నాతఁడును నాత్మపరిశీలనార్థ మచట
ననుమతించె వసించుటకును బ్రియమున. ౨౦

గీ. దినదినంబును రంభాదిదివిజవనిత
లాటపాటల వివిధవిద్యావినోద

కృతుల నలరింప వలపింప నించుకైన
నతఁడు చలియింపఁ డాత్మవిద్యానిరూఢి. ౨౧

సీ. ఊర్వశీ రంభా తిలోత్తమ లాదిగాఁ
గలవారవనితలగాఁపలహారి
యక్ష సిద్ధాదుల నైహికసుఖభోగ
దైశ్వర్యమదమహాహర్ష ధార
నవనిధు ల్గలధననాథునైశ్వర్యపు
ష్పకరాజగర్వప్రశస్తవృష్టి
యాకాశచుంబిశాత్యంతాభిరమణీయ
సౌధశిలాకాంతిసముదయంబుఁ

గీ. బొంగి పొరలియు నాతనిఁ గ్రుంగఁ జేయఁ
జాలకయ బడబాగ్నితో సరియె నైన
యతనితీక్ష్ణతపఃప్రభావానలమును
దాఁకఁ జాలక వెలవెల్లఁదనము గనును. ౨౨

గీ. ధనదుప్రోలున నుండి గంధర్వయక్ష
సిద్ధసాధ్యులతోడను జెలిమి కలిగి
రంభ మొదలైనయప్సరోరామలకడఁ
జలనరహితుఁడై యొక్కవత్సరముఁ గడపె. ౨౩

సీ. ఉదయకాలమునవిధ్యుక్తసంధ్యావంద
నాగ్నిహోత్రాదుల నాచరించు
స్వాధ్యాయనాత్యంతసక్తచిత్తముతోడఁ
బరమేశుపదములఁ బ్రస్తుతించు
మాధ్యాహ్నికోచితమంత్రతంత్రనిరూఢి
నిత్యకర్మకలాపని యుతి జరపు

నమృతోపమానభక్ష్యాన్నపానీయముల్
తగుకొలందిగఁ దృప్తిఁ దా భుజించు
గీ. నడుమఁ దోతెంచువారలనడత లెఱిఁగి
యుచితరీతుల భాషించు నచలుఁ డగుచు
సాంధ్యకృత్యములం దీర్చు శాస్త్రరీతి
నిత్యమును నిష్ఠతోడుత నిర్మలముగ ౨౪
చ. మలినవిదూర మై తనదుమానసబంభర మెల్లవేళలన్
సలలితనూత్నపద్మరుచిసంపదఁ బొంపిరివోవునీశ్వరాం
ఘ్రిలపయి వ్రాలియుంట నితరోన్నతవస్తువు లొల్ల కెన్నఁడున్
జలనవిహీన మై నిలువ సాగు మహేశపదాంబుజంబులన్. ౨౫
గీ. పరమపావనమానసబంభరంబు
మృడపదాంబుజవిలసితామృతముఁ గ్రోల
నెచట నుండిన నేమి దేహేంద్రియములు
తనశరీరమె మఱచుతత్త్వజ్ఞునకును. ౨౬
గీ. బ్రహ్మచర్యాశ్రమోక్తజీవనమునందు
నాత్మసంయమనమ్ము ననాత్మవిధము
నాచరణపూర్వకంబుగ నభ్యసించి
నట్టివటుదృష్టి పోవునే యట్టు నిట్టు. ౨౭
గీ. ఆత్మపరిశీలనార్థమై యచటఁ గడపి
తాను గాంచినవిజయసందర్శనమున
నాత్మఁ బొంగె నష్టావక్రయమివరుండు
సంతసంబందె ధనియు మచ్చరము వాయ. ౨౮
గీ. అంత నొకనాఁడు ధనదుఁ డత్యంతభక్తి
వచ్చి కూర్చుండి యాతనివాంఛ యడిగి

"తెలియఁ జెప్పుఁడు తీర్థ సేవలపునైన"
ననుచుఁ బ్రార్థించె వందన మాచరించి. ౨౯

చ. "వనములఁ గాయకూరలను వాంఛలు లేక క్షుధార్తిఁ బాపఁగా
దినుటయు నిత్యముగ్ ఘనవిధేయతతోఁ బరమేశుఁ గొల్చుటల్
మనము కలంక దేఱఁ బరమార్థముఁ గాంచుట వృత్తి గ్యైన మా
కనభిమతంబ కాదె యెవియైనఁ దదన్యపదార్థజాలముల్. ౩౦

ఉ. కావున నెద్దియుగ్ వలదు కామ్యము; కాని సుఖాబ్ధిఁ దేలితిగ్
నీ వొనరించినాఁడవు వినిర్మలబుద్ధి ననేకసత్క్రియల్
భావమునం దలంచెదను భద్రము నీకగు నంచు నిత్యముగ్
బోవఁగఁజూడుమింక ననుఁబుణ్యము నీకగుఁబోయివచ్చెదన్. ౩౧

చ. అనినఁ గుబేరుఁ డంత వినయంబునఁ బల్కె "మహీసురోత్తమా!
యనవరతంబుఁ ద్వాదృశు లహమ్మతినిర్మథనప్రవీణు లిం
పునఁ గడుసన్నిధానమునఁ బూజల నంద మదియభాగ్య మే
మని కొనియాడఁ జాలుదు మహాత్మ! తదన్యము కోరుకొందునే ?

గీ. పలుకఁజాలను మీరుపల్కులకు నెదురు
కాని యిఁక నొకవత్సరకాల మాఁగ
వేఁడెద" నటంచుఁ బల్కుకుబేరుఁ జూచి
"పోవలయుఁ దప్ప" దని పల్కె నావటుండు. ౩౩

చ. అనఁగఁ గుబేరుఁ డంత వినయంబున లేచి మహీసురోత్తముగ్
దనపరిచారబృందములఁ దత్పరతం జనుదేరఁ బంచి యా
తనివెనువెంట నేఁగెఁ దనతథ్యపుభక్తినిఁ దెల్ప నాతఁడుం
బనిగొను మంచుఁ బుచ్చి తనమార్గముఁ బట్టె హిమాద్రిచెంతకున్.

గీ. వయసు చూడఁగ నడిమియావనము కాని
యన్య మది కాదు రంభాది కాప్సరసలఁ

జూడ నొల్లఁడు కన్నెత్తి చూచు నాత్మ
ననుచుఁ బొగడుచు ధనదుండు నరిగెఁ బురికి. 3౫

మ. హిమశైలస్థలవాసులన్ సతతసర్వేశార్పితస్వాంతులన్
గమనీయప్రతిభాప్రభావు లగుభక్తశ్రేష్ఠులం గాంచునా
సుమహార్థంబుల నెంచుచున్ బ్రతిపదస్తోత్రప్రహృష్టాత్ముఁడై
హిమశైలంపుసమీపభూములకుఁ బోయెన్ మౌనివెన్వెంటనే.

క. హిమవంతుఁడు హిమతనయయు
హిమవంతుని యల్లుఁడైనయీశ్వరుఁడును నా
హిమకరుఁడు నెల్లవారలు
సమయంబున జ్ఞప్తి రాఁగ సంభావించెన్. 3౭

చ. అచటఁ దపోవ్రతంబున ననంతసుఖాస్పదపుణ్యమూర్తులై
యచలితభక్తియోగమున నాహిమవంతుకుమారిభర్త నెం
చుచు హృదయాంబుజంబుల వచోవిభవాతిశయంబులన్ స్తుతిం
చుచు వసియించువారలను జూచి ప్రమోదము సంఘటిల్లఁగన్.

క. అష్టావక్రుఁడు భక్త్యా
విష్టుం డయి సన్మునీంద్రవితతిని గని తా
నిష్టావాప్తికి వారికి
సాష్టాంగము చేసి చనును శశ్వత్ప్రీతిన్. 3౯

గీ. అతఁడు చని కాంచె నంత మహాప్రశస్త
మఖిలనగరాజ మైనహిమాద్రి రాజ
మధికపుణ్యంబునం గాని యబ్బ దనుచుఁ
జూడఁ దలపోయ వినుతింప జూడఁ దెలియ. ౪౦

సీ. హిమశైలతట మెక్కి యీరీతి నీశ్వరు
ధ్యానింపఁ దొడఁగె సద్భక్తి మీఱ

"నో మహాదేవ! శంభూ! జగదీశ్వర!
యఘజాలహారణ! తుభ్యం నమోఽస్తు
భక్తవత్సల! మహాభక్తసన్నిహిత! కృ
పాపూర్ణ! అభవ! తుభ్యం నమోఽస్తు
సర్వలోకశరణ్య! సర్వదేవవరేణ్య!
యఖిలలోకనుతే! తుభ్యం నమోఽస్తు

గీ. దేవదేవ! మహాదేవ! దివ్యదేహ!
పాహి పాహి కృపాకర! భక్తవరద!
యీశ్వరా! నన్ను నేవేళ నేలుమయ్య!
హృదయపద్మంబునను వసియింపుమయ్య! ౪౧

గీ. సాంబ! శివ! సదాశివ! శర్వ! శంకర! మృడ!
అభవ! భవ! సర్వలోకభయహరణ! భయ
నిలయ! లయకర! లయహర! నిత్య! సత్య!
శరణు త్వచ్చరణంబుల శరణు శరణు. ౪౨

గీ. లలితచాంపేయగౌరార్ధలసితకాయ!
ఘనసుకర్పూరగౌరార్ధకలితకాయ!
నాథ! బాలేందుమౌళి! జటాధరా! మ
హాత్మ! కైకొమ్ము నాదుసంప్రార్థనంబు" ౪౩

గీ. అనుచు బహువిధకీర్తనాయత్తుఁ డగుచు
నీశ్వరక్రీడనస్థలి నెలమిఁ గాంచి
సత్ప్రదక్షిణముగ శివు సంస్తుతించి
గిరిజ కెఱఁగి మహాభక్తి కీలుకొనఁగ. ౪౪

గీ. ఒడలు మఱచినధ్యానము గడలుకొనఁగ
నచటఁ గడపెను భక్తి నయ్యభవుమ్రోలఁ

గొన్నిదినములు నిద్రయు క్షుత్పిపాస
లనున వెలుఁగ నష్టావక్రమునివరుండు. ౭౫

గీ. మృడసమారాధనాఫల మీప్సితార్థ
మొసఁగకుండునె కోరిన నూరకున్నఁ
గోరికొన్న సకామమై కోర్కి నొసఁగుఁ
గోరకున్న నిష్కామమై గురుత నొసఁగు. ౭౬

గీ. అఘహారం బగునట్టిహిమాలయంబు
నఖిలమునిసేవ్యమైనహిమాలయంబు
నీశ్వరక్రీడనస్థలి హిమనగంబు
నీప్సితార్థము లిచ్చెడిహిమనగంబు. ౭౭

గీ. భరతజనయిత్రిసత్తపఃఫలనగంబుఁ
బరమపావనభారతభాగ్యనగము
భరతగౌరవచిహ్నసంభరితనగము
విడువ లేక విడువ లేక విడిచె నతఁడు. ౭౮

గీ. హిమనగంబును వీడువహీసురుండు
ప్రాజ్ఞగంబును వీడునర్యమునిఁ బోలెఁ
బద్మినీకాంతప్రియుఁ డగు భాస్కరుండు
సుప్రభాకాంతిప్రియుఁడు వటుప్రభుండు. ౭౯

చ. తనగురుకార్యనిర్వాహణతత్పరతఁ గడుభక్తియుక్తుఁడై
మునివరుఁ డంత నేఁగి కనె ముందట నొక్కమనోహరాత్మకం
బును బరమాద్భుతాకర మపూర్వమహత్త్వవిశేషమూలసం
జనితము నైనదివ్యవనసారము నీపవనంబు నచ్చటన్. ౮౦

సీ. అజ్ఞానతిమిరంబు నపహరింపఁగఁ జొచ్చు
విజ్ఞానభానునివిధము గాఁగ

నంబుజాకరమధ్యమందుఁ జొచ్చి యఘంపు
దీవలఁ ద్రెంపెడుద్వీపమురీతిఁ
బాపకౌరవజాతి రూపుమాపఁ గడంగు
విజ్ఞానియభిమన్యువిధము గాఁగ
మబ్బు పెంచెరలను మటుమాయ మొనరించు
బాలప్రభంజనులీలఁ దోఁప

గీ. నీపవనమును జొచ్చె మునీశ్వరుండు
కనుఁగొనెను దానిలో నొక్కకనకనగము
నందు రమణీయ మైనహర్మ్యములు కొన్ని
యందు సౌందర్యనిధు లైనయంగనలను. ౪౧

మ. కమనీయం బయి దివ్యరత్నగణముఖ్యస్యూతసౌధప్రభా
రమణీయాత్మక మై మహామహిమచే రంజింపఁగాఁ జేయుచు
న్నమితం బై రమణీమణీమయము జ్యోత్స్నాపూరనిర్మగ్నమూ
ర్భ్రమదోద్రేకకరంబు నై ననగరప్రావీణ్యముం గాంచఁగన్. ౪౨

ఆ. ఇంద్రుపురవరంబు నీడు కా దనవచ్చు
ధనదుప్రోలు పోల్పఁ దగదు చూడఁ
జూడఁ జూడ దాని కీడు లే దనవచ్చు
ననుచు మౌని లోని కరుగునపుడు. ౪౩

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రమోబింబంబు
నపహసింపఁగఁ జాలునాననములుఁ
గమనీయచాంపేయసుమరమణీయతఁ
ద్రోసి రా జనఁజాలునాసికలును
దివ్యదర్పణమహాదీప్తిసంజాతంబు
దిద్దఁ జాలెడుచెక్కుటద్దములును

నాలోలాత్ములమందమందగమనం బాపుణ్యమానీశ్వరుల్
లోలుం జేయఁగఁ జాల కున్నవి యలోలుండైన పుణ్యాత్ముంబుసన్.

గీ. అన్యకాంతలఁ దల్లులయట్లు గాఁగఁ
గాంచఁ జాలినమానవగౌరవంబు
ఖండఖండాంతరముల నెక్కడను లేదు
పరమపావనభారతధరణిఁ దక్క. ౬౦

శా. ఆయభ్యంతరమందిరంబున సమర్హం బైనరత్నావళీ
చ్ఛాయల్ చిమ్ముమహాసనంబుపయి స్వచ్ఛస్వర్ణసందీప్తితోఁ
బ్రాపం బందినప్రౌఢయొక్కతె సువస్త్రస్నిగ్ధభూషాళితో
జాదూమేయమనోహరాంగియయి యాశ్చర్యంబుగాఁ గాల్పఁగన్.

మ. తనప్రాయంపుటనుంగునెచ్చెలులతోఁ దారుణ్యసంపచ్ఛభా
ననపద్మంబుమనోహరాకృతుల నీరజ దివ్యపర్యంకమం
దున లీలామయ మైనచిర్నగవుతోఁ దోఁపుసతీజనం
జనితామేయపరిమళంబు నిగుడన్ సంభాషణం జేయుచున్. ౬౨

గీ. ఉన్నయుత్తరదిశ యనునువిదకడకు
మునికుమారునిఁ గొనిపోయి మగుద లపుడు
"జయము జయము దేవేరికి జయము జయమ"
టనుచు వినయంబుతో నెల్ల మనవి చేయ. ౬౩

గీ. ఆమహారూపవతి లేచి యర్ఘ్యపాద్య
ముల నొసంగెను భయభక్తిమోదములను
వల దనక యందె మౌనియు వాంఛ లేక
కన నయాచితలబ్ధభోగమ్ము లగుట. ౬౪

గీ. అతనిఁ బొడగాంచినంతనే యామె కపుడు
తనువు పులకించె మోమునఁ ద్రప జనించె

పద్మదళంబులపస నీసడించెడు
నిరుపమానవిశాలనేత్రములును

గీ. నవకిసాలమృదుత్వమ్ము నవ్వఁ జాలు
సరసిజాతీతముల్ కరచరణములును
వర్ణనాతీతసౌందర్యవతులఁ జేయఁ
గాంత లోకకొండ అచ్చటఁ గానరాఁగ. ౫౪

గీ. కులుకుఁజూపులు బంగారుతళుకు లీను
ముద్దునగుమోములందు వ్యామోహ మొదవఁ
దావి యబ్బినబంగారుతళుకుబొమ్మ
లనఁగఁ జూపట్టు కాంతాజనాళి నచట. ౫౫

క. కాంచి మునిచంద్రుఁ డంత స
మంచితధీయుక్తిఁ జేరి యాకాంతల రూ
పించియును బల్కరింపఁగ
నంచితగతి నతని వార లాహ్వానింపన్. ౫౬

మ. నిజనామంబును గార్యముం బలికి నిర్ణిద్రస్థితిం జెందఁ బం
కజలోలాక్షులు వానిఁ దోడ్కొని మహాకామ్యార్థభూమిష్ఠతన్
విజనంబై నరహః ప్రదేశమున దుర్వ్యుత్థాసమారంభ చి
త్తజచేష్టాపరిపూర్ణ లౌచుఁ జని రాత్మప్రభ్యిఁ జూపింపఁగన్. ౫౭

ఉ. వారలయొప్పికంబును నపారవిలాసమనోజ్ఞసంపదా
కారములన్ మృదూక్తుల వికారవిహీనము నై నచిత్తసం
చారమునన్ గ్రహింపఁగ నసారము సర్వ మటన్నబుద్ధికిన్
వారలు దోఁచుచుండిరి ప్రభావమునం దనకన్నతల్లు లై. ౫౮

శా. ఆలావణ్యతనూవిలాసములు నాయాచిత్తచాంచల్యముల్
ఆలాపప్రభవోత్తమంబు లగునాయాహాసముల్ వింతయా

సిగ్గునునుదొంతరలు నిల్పఁ జేరె మనము
క్షణములోపల నతనివశంబు గాఁగ. ౬౫

గీ. ఆమెఁ బొడగనినంతనే యతని కపుడు
పైఁబడియుఁ దోన చంచలత్వము నశించెఁ
బుష్పబాణునిశితబాణములును నాఁటి
మొక్కవోయిన నతనియమోహరక్ష. ౬౬

గీ. నయము భయమును వలపు వాంఛయును గలిసి
పరిఢవిల్లఁగఁ బ్రౌఢ యై పడఁతి యిట్లు
పలుకఁ జొచ్చెను మునివంశతిలకుతోడ
సాదరార్ద్రితసునోజ్ఞవాచానిరూఢి. ౬౭

ఉ. "ఓసుకుమార! మారనిభ! యోమునివంశకులప్రదీపకా!
మాసుకృతంబు లెల్లఁ బరమస్థితి నందెను నీదు రాకచే
నీసుముహూర్తమెంచి గణియించుచునుంటి యుగంబులెన్ని యో
యాసనఁ గ్రహింపుము వయస్యుఁడవై కొనుమయ్యమన్ననల్.

చ. కలిగినదాన నెన్నియొ యఖండమహాధనధాన్యసంపదల్
మెలఁగెడిదాన నీపురికి మేలగు రాజ్ఞిపదంబుతోడ నే
నలఁగినదాన నిందనుక నాత్మజఘోరమహావనాగ్ని చేఁ
గలిగిన నేమి కాంచఁగద కాంతునిఁ గాంతు నిఁ కిచ్చట౯ ప్రభూ!

ఉ. కాంతవిలాససంపదలు కాంతునితో సుఖియించునప్పుడే
వింతలు వింతలై పరమవిస్తృతశాశ్వతరూప మందుటల్
కాంతలు కాంతలే తమదుకాంతులఁ గూడి సుఖింపనప్పుడా
కాంతలు కాంతశబ్దభవకష్టనికృష్టపరాత్కరంబు లౌ. ౭౦

ఉ. అందము చందము౯ నయభయంబులు గల్గి మనోహరాంగుతో
సుందరి కూడియున్నఁ గడుచోద్యమునం గనుఁగొందు రంట నా

కేందుముఖుల్ సతంబు జనియింపఁగఁ గోరుదురంట భూమిపై
నందము చందముల్ నయభయంబులు కల్గి పతుల్ గ్రహింపఁగన్.

క. ఈసర్వము నీయదియే
వీసంబును సంశయంబు వెదుకకు మదిలో
నోసౌందర్యనిధానమ!
వాసింతము సంతతంబుఁ బ్రణయార్చనతో." ౭౨

మ. అనుచున్ సన్నిధి కేఁగుదెంచి మునిహస్తాశ్లేషముం జేసి యా
తని నాయుత్తమతల్పమం దునిచి మిత్రా! యన్న సంబోధనం
బునఁ బ్రేమాంకురబీజముల్ విడుచుచున్ బోఁ బంచెనారీజనం
బును నౌచిత్యసుఖానులాపముల నామోదంబు సంధిల్లఁగన్. ౭౩

చ. అది యొకమానినీజనవిహారవిలాసకలావనంబు స
మ్ముదమున నేలు దాని నొకమోహనరూప త్రిలోకజేత్రి యా
సుదతి వసించు నందు నొకసుందరసౌధమునందు సర్వసం
పదలకుఁ బుట్టి నిల్లది ప్రభావవిరాజిత మెల్లవేళలన్. ౭౪

గీ. రత్నసౌధంబు బహురశ్మి రాజితంబు
దివ్యపర్యంకమందు సందీప్తదివ్య
ధవళవసనాంగ రాగ సౌందర్యమూర్తి
యాన వేచు నష్టావక్రమౌనిపతిని ౭౫

ఉ. "ఎచ్చటినుండి యెచ్చటికి నేమిష నిట్టులు తెచ్చినాఁడ వే
మిచ్చటఁ జేయ నెంచితి మహేశ్వర! నీదుకృపావిలాస మే
యచ్చున నెన్నవచ్చు నహహా! ఘటియింతు క్షణంబులోన నే
యచ్చపుబుద్ధికిన్ దెలియనట్టివిచిత్రవిలాసదృశ్యముల్. ౭౬

ఉ. నీకృప కల్గినట్టినరు నిత్యనికృష్టుని నైన సర్వలో
భాకరమౌ మహామహిమ భాస్కరుఁ బోలఁగఁ జేయు దింకఁ దా

నీకృపఁ గాంచనట్టినరు నిర్మలు లైన క్షణంబులోనఁ బా
పాకరుఁ జేతు సర్వదురితావళిచే క్షణమాత్రలోఁ జెడన్. ౭౭

గీ. జనన మందినదాది సంసారమునన
దెలుఁగ కే మునివృత్తియం దెసఁగుచుండ
స్వీకరింపుము గార్హస్థ్యశిక్ష ననుచు
నేల విధియింపఁగా వలె నిట్లు గురులు. ౭౮

గీ. గురునివాక్య మమోఘ మం చురువిధేను
తాప్రవృత్తుఁడనైతి నింతయును నేల
యేల యావదాన్యుండు న న్నిచటి కనిపె
నీశ్వరవిలాసమే యిది యెల్లఁ జూడ. ౭౯

గీ. ఏసతీశ్వరలీలావిలాస మిట్లు
సర్వజీవుల నాడింపఁ జాలు నట్టి
యీశ్వరవిలాసమే నన్ను నీసతిని
వహపువంత్రలనుండి కాపాడుఁగాత." ౮౦

గీ. అనుచు మౌనీంద్రుఁ డాత్మఁ బ్రార్థనము చేయు
నీశ్వరుని సర్వదోషాపకృష్టుఁ బ్రీతి
బాహ్యసృష్టికి నేమి తోఁపనికతమున
నామృగేక్షణ పల్కె నత్యంతకాంక్ష. ౮౧

ఉ. "ఓనవయావనోజ్జ్వలమహోన్నతరూపవిలాస! దివ్యతే
జోనిధి! నీమనోహరవిశుద్ధతరాధరజామృతంబు నెం
తేనియుఁ గ్రోలి క్రోలి తమిదీఱ సుఖింపఁగ నున్న నాకు స్వ
ప్నానుభవంబు లేల యికఁ బ్రాంజలి నౌదు గ్రహింపుమీ చెలిన్."

ఉ. కాయలు కాచిపోయినవి కన్నులు నీదుమనోహరాంగమా
ప్యాయముగా నురంబునకు హత్తి సుఖింపఁగ నున్న కాంక్షతో

నాయమముఁ జూచి యొక్కపరి నారతుఁ జూచి సుఖానుభూతుల న
న్నీయెడఁ దేల్పుమయ్య! కరుణింపుమయా! సుకుమారమన్మథా!

ఉ. దోసము లేదు నా కిటను దోడయి నీవు సమస్తసౌఖ్య శో
భాసముపార్జనంబునను భాగము నంది చిరంబు వర్ధిలన్
వీసము లేదు సంశయము వీనికి నెల్లను సార్వభౌముఁ డీ
వే సఖ! దైవసాక్షి వరియింతు నినున్ హృదయాధినాథుగన్.

ఉ. కన్నియ నేను నీపరమకారుణికత్వ మపేక్ష చేయుదున్
వన్నెయు వాసియుం గలుగువారలలోన గణింతు రెన్నఁడున్
న న్నొకదాసిగా జగతి నాకు మనోహరరూప! నీదు సౌ
ఖ్యోన్నతభూరిభాగ్యమె ప్రభూత్తమ నేఁడ యనుగ్రహింపవే.

ఉ. ఉన్నది లోకమోహనమహోన్నతరూపధనంబు నీకు నా
కున్నది తావకీనపరమోత్తమరూపముఁ గొల్లగొట్ట నీ
కున్నది సత్తపోధనము-ఊరక పోవునె తత్ఫలంబు నా
కున్నవి రూపసంపద లహో! యింక బంగరు తావి నందెగా" యటం

క. అన విని యష్టావక్రుఁడు
మనమున నొకయింతదురభిమానముకతనన్
ఘనహృదయతీవ్రపరిశో
ధనమున మాటాడకుండెఁ దస్త్రీమణియున్. 52

సీ. "ఆగర్భసంద లందినదీనను
భవ్యభిక్షాం దేహి బ్రహ్మచారి!
నవయౌవనోజ్జ్వలనవమోహనాంగిని
భవ్యభిక్షాం దేహి పతివతంస!
ఆకాంక్షతో నుంటి నన్య మేమి యెఱుంగ
భవ్యభిక్షాం దేహి దివ్యరూప!

ఆజీవితాంతమహర్నిశంబును గొల్తు
భవ్యభిక్షాం దేహి బ్రహ్మవిజ్ఞ!

గీ. అధివసింపుము మన్మానసాధినాథ
పదమహాభోగసామ్రాజ్యపరమపదవి
దేహి యని యెన్నఁ డోరుల నర్థించి యెఱుఁగ
నర్థనీయుఁడ వర్థింతు నహరహంబు." ౮౮

క. అని పతిఁ గమ్మని కోరిన
వనితామణిఁ గాంచి మధురవచనామృతసం
జనితామేయసుఖంబున
నని తోఁపఁగ నూరకుండె నావటుమణియున్. ౮౯

క. ఉత్తరదిశయును దన కా
యత్తుఁడు కాఁడే మొ యనెడు ననుమానముతో
నుత్తలపడియును నాతని
చిత్తము రంజింపఁ జేసెఁ జిరసత్క్రియలన్. ౯౦

ఉ. అంతట లోకబాంధవుఁ డహఃపరిపాలన మంతఁ బాసి వి
శ్రాంతి వహింపఁ గోరి తమసానది స్నానజపార్థి యౌచును
స్వాంతసరోజుఁ డై చనెడియాకృతితో ఘనపశ్చిమాబ్ధిలో
వింతవినీల కాంతిసమవేష్టితుఁ డై పడియెన్ మహాప్రభన్. ౯౧

ఉ అంత నతండు క్రుంకుటయు నాకసమందు వెలింగెఁ దారకల్
సంతతయౌవనోజ్జ్వలవసంతరమారమణీయమూర్తులౌ
కాంతలు సంతసంబున ముఖంబులు వీడి వినీలవస్త్రదే
హాంతర లై నభశ్చరమహాపదవిన్ గయికొన్న యట్లుగాన్. ౯౨

ఉ. అప్పుడు తారకాసముదయంబు తమస్సును ద్రోసి వేయుచు
న్నప్పుడుతోఁచె మింట నుడునాయకుఁ డద్భుతమోహనద్యుతుల్

దెప్పర మావిధంబునఁ బ్రదీప్తము గాఁగ హిమప్రదీప్తమై
యొప్పుచునుండ సర్వమును నూహలు రేప వియోగిజాతికిన్.

గీ. బహుళసౌందర్యరూపవిభ్రాజిత లగు
కామినులయొద్ద నున్నపుణ్యాత్ములుండు
కళల నీనెడుతారకాకాంతలకడ
విభుత నొప్పారుతారకావిభునిఁ బోలె— ౯౪

గీ. మానిచంద్రునిఁ బోలఁ డేమాత్రమైనఁ
జదల విలసిల్లునట్టియాచంద్రముండు
అతఁడు తారావశుఁడు ద్రోహి యాతతాయి
హింసకుండు వియోగుల కితఁడు కాఁడు. ౯౫

క. ఉత్తరదిశయును నాఁ డా
యత్తము గావించె మునికి నఖిలాన్నంబుల్
చిత్తమునఁ దగులు లేకతఁ
డుత్తమముని యై గ్రహించె నుచితంబుమెయిన్. ౯౬

గీ. సర్వమును నీశ్వరేచ్ఛగా జగతిఁ గాంచు
బ్రహ్మవిదుఁ డెట్టియెడల నిర్వాంఛితుండు
లేమిఁ గుందఁడు కాంక్షింపఁ డేమిగాని
పంచభక్ష్యాన్న లబ్ధి సంబరముపడఁడు. ౯౭

గీ. బ్రహ్మచర్యాశ్రమంబున బ్రదుకుఁదెరువు
గార్హ్యధర్మప్రపాలనగౌరవంబు
సర్వ మీశ్వరార్పణబుద్ధి సహనశక్తి
నేర్పునాశ్రమధర్మ మన్నింట మెఱుఁగు. ౯౮

గీ. ఋషివతంసులు నిర్మించి యొసఁగినట్టి
యాశ్రమపుధర్మములు చూడ నద్భుతములు

విశ్వమందున వేఱొక్కవిషయమందు
నెచటఁ బొడఁగాన మిట్టియుత్కృష్టపథము. ౯౯

మ. జననం బందినదాది మానవుఁడు౯ శశ్వచ్ఛుభావాప్తికై
ఘనసంసారపయోధి దాఁటుటకు సన్మార్గంబుఁ జూపించు న
త్యనుకూలం బగుధర్మపద్ధతుల నాదర్శంబుగాఁ జేసి క
ర్మనికాయంబుల నేర్పరించునుగదా మాన్యార్యర్షిసిద్ధాంతముల్.

మ. భువిపై జన్మము నంది యెవ్వఁడును దాముక్త్యర్థ మేత్రోవకో
యవివేకంబున నేఁగఁబోవఁడుకదా యార్యోక్తధర్మంబుఁ దా
ను వివేకంబుగఁ బాటిసేయునెడఁ బుణ్యుం డై యిహాముత్రసౌ
ఖ్యవిలాసంబుల నోలలాడునుగదా యాదర్శ మాజీవికన్. ౧౦౧

మ. అమలం బై పరిపూర్ణ మైనమనవర్ణాచారసంపత్తి ని
త్యముశుద్ధాత్ములఁ జేయఁగాదె మనకామ్యంబుల్ ప్రసాదించియం
తమున౯ మోక్షపదం బొసంగఁగల దీధర్మప్రబుద్ధాత్ముల౯
యముఁ డైనం గనఁజాలఁడంట మనభాగ్యం బింక సామాన్యమే!

తే. ఆశ్రమాదర్శ మది చూడ నద్భుతంబు
బ్రహ్మచర్యంబునం దె సర్వమును నేర్చి
గార్హ్యధర్మంబుఁ బాటించి కడకు ద్విజుఁడు
తాఁ దృతీయాంతిమంబుల ధన్యతఁ గను. ౧౦౩

కం. అష్టావక్రమునీంద్రుఁ డ
వష్టంభము లేక ధర్మవశుఁ డై వనితా
దుష్టకుతూహలసిద్ధి న
నిష్టంబునఁ ద్రోసిపుచ్చె నిశ్చలమతి యై. ౧౦౪

## ఆశ్వాసాంతము.

చ. అమలినమానసాంబురుహా! ఆశ్రితరక్షణదక్ష! ఉత్తమో
త్తమపరమర్షి! యోగిజనతాప్రతిమప్రవణాంతరంగ! సం
తమసనిదూరభాస్కర! వ్రతాచరణైకమహాప్రదీపకా!
విమలమహాప్రబోధఘనవిజ్ఞ! మహాత్మ! దయామయా! ప్రభూ!

పంచచామరము :

మహావిరాగసంపదార్ష మత్తనాగ శేఖరా!
విహారసర్వదేశలభ్యవిశ్రుత ప్రజార్చితా!
ఇహంబునన్ బరంబునన్ నిరీహ నిచ్చుసద్గురూ!
వహింపుమయ్య మామకీనప్రాణరక్ష నిచ్చలున్. ౧౦౬

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వగౌతమ
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్ర వేంకటసుబ్రహ్మణ్యేశ్వ
రాన్నపూర్ణాదేవీ చతుర్థపుత్ర బులుసు వేంకటే
శ్వర ప్రణీతాష్టావక్రచరిత్రమునందు
ద్వితీయాశ్వాసము.



ఓం

# అష్టావక్రచరిత్రము

## తృతీయాశ్వాసము.



యుత! సంభావ్యప్రతి
భాయుత! నిఖిలాగమాంతపారంగత! వి
ద్యాయోషామణి మెచ్చిన
ప్రాయంపుటనుంగుబిడ్డ! బ్రహ్మజ్ఞానీ! ౧

వ. దేవా! తదనంతరకథాక్రమం బెట్టి దట్టిమహనీయగుణగరిష్ఠుం డగునష్టావక్రుం డేమి చెప్పె నెట్లుండె చెప్పవే యట్టి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడు త్రిలోకపూజ్యుఁడు త్రికాలస్మరణీయుఁడు గదే యనుయుధిష్ఠిరునుత్సాహంబున కామోదించి భీష్ముం డిట్లు చెప్పం దొడఁగె. ౨

గీ. రమ్యమణిమయకాంతివిరాజితంబు
హంసతూలికాతల్పంబునందు వాని
నుచితప్రియవచనంబుల నుంచి యామె
నవ్యపరిమళవిలసితాననము నందె. 3

గీ. ఏవిలాసంబుఁ జూపిన నించుకైన
చంచలింపనివానీంద్రు నెంచు మదిని

మఱియుఁ జూచెదఁ గా కని మహితవిభవ
శోభితాపాంగ యై మునిసూనుఁ గాంచి. ౪

క. నీ తయ్యే నేమొ యనుచును
నాతనితల్పంబుఁ జేరి యభినవమూర్తిన్
నాతుక కౌఁగిటఁ జేర్చిన
నాతఁడు చలియింపఁ డయ్యె నప్పటికైనన్. ౫

గీ. అఖిలలావణ్యపుంజ మైనట్టివనిత
నవనవోజ్జ్వలయౌవనానందదాత్రి
శయ్యఁ జేరిననైన నిశ్చలత విడఁడు
మౌనిమానస మెంతనిర్మలిన మొ కద! ౬

గీ. అంత వనితాంతరంగ మనంత మైన
చింత వలవంతఁ గడువింత నంత కంత
కెంతయును వంత కాకర మంతఁ గాఁగఁ
దంతు నెంతయుఁ బోలినకాంతుఁ జూచి. ౭

ఉ "ఏమని వేఁడుకొందును మునీశ్వర! నీదుకృపావిలాసహా
సామలదివ్యదృష్టి నొకసారి పయింబడనిమ్ము చాలునో
యీ! మహితానుభూతి యగు నయ్యదియే యిఁక లాఁతిదాననే?
మామకజీవనౌషధము మాటలు వేయును నేలనీవెసూ ౮

క. మగవారు భోగపరు లని
వగమానితి నిన్నుఁ జూచి వరణీయ ననున్
నగుఁబాటుచేయ కేలుము
వగ లుడుపుము సర్వలోకవంద్య! మహాత్మా! ౯

శా నాసర్వస్వము నీవె సుమ్ము పలుకుల్ నా కింక వేయేల నీ
దాసీత్వంబున కొప్పుకొందును సదా దాస్యంబు నేఁ జేయుదున్

నాసంపత్తులు దివ్యభోగములు నీనారీజనానీకమున్
నీసొత్తే యగు నేఁటినుండి మఱి ప్రాణేశుండ వీవే యిఁకన్."౧౦

చ. అని కరుణాపరత్వమున సర్మిలి వేఁడిన మాని యాత్మలోఁ
గనలియుఁ జెప్పి చూచెదను గాకని దీర్ఘవిమర్శనాంతరం
బున "వనితా! పరాంగనలమోహముః గనుంగొనఁ జాల మేను మా
కును భవదీయభోగములకుం గల దంతర మెంత యో" యనెన్.

క. పలికినపలుకుల కప్పుడా
చిలుకలకొలికియును దనదుచిత్తములోనన్
మెలఁకువ యలుకయుఁ గలుగఁగ
వలపులవిరిఁబోణి పలికె వటుమణితోడన్. ౧౨

చ "పలికితి కోటివేల్పులుకె బంగరు వాయెను నింతదాఁక నీ
పలికినదానిభావ మది ప్రస్ఫుట మాయెను సంతసంబు మా
కలవడ దంతనీతి విరహార్తిమెయిన్ సుకుమారరూప! నీ
యులఘుతరప్రవర్తనము హానిగడించునె మమ్ముఁ గూడినన్." ౧౩

క. అన నాయష్టావక్రుఁడు
"వనితా! వేయేల! యన్యవనితలఁ గూడన్
గన సప్తవ్యసనములం
దున నత్యంతమును దోషదూషిత మగుటన్. ౧౪

ఆ. శూద్రవనిత యైనఁ జొప్పడు నత్యంత
దోష మామె విప్రదుహిత యైన
నగును పాతకంబు నప్రమేయంబును
గానఁ గాంత వలనఁ గాదు నిన్ను. ౧౫

చ. అదియునుఁగాక నేను బ్రథమాశ్రమమందుఁ జరించియుంటి నిం
తదనుక మాగురూత్తమునిఁ దన్పుచు నస్ఖలితప్రదీప్తితో

మదిఁ గరుణించి వారు ననుమాన్యునిఁ జేసి గృహస్థధర్మముం
బదిలముగాఁ గ్రహింపుమన వచ్చితి నాపనికై తలోదరీ! ౧౬

ఆ. కాన నేను బోయి కన్యకఁ గైకొని
యాశ్రమంబు నడుప నరుగ వలయు"
ననిన వానిమాట లాలించి నాతియుఁ
బలికె నిట్టు లమితభావ మలర. ౧౭

ఉ. "కన్యక నేను నస్ఖలితఁ గాన గ్రహింపఁగవచ్చు నీకు సా
మాన్యను గాను నన్యుల నుమాపతితోడు వరింప లేదు నీ
మాన్యతఁ గాంచినంత నను మానము లేక వరించియుంటి నీ
వన్య నొకర్తుఁ గన్యకను నారయనేల గ్రహింపుమీ ననున్. ౧౮

క. వెదుకఁగఁ బోయినతీవయె
పదములకుఁ దగిలె నన్నపద మీయెడలన్
విదిత మగుఁ గాన నీవీ
యెద నెఱిఁగి పరిగ్రహింపుమా! మత్కరమున్. ౧౯

గీ. కావకీనసురోత్తమోత్తమునియానఁ
బాటవంబునఁ జెల్లించువాఁడ వౌదు
వస్మదీయమనోభీష్ట మదియుఁ దీఱుఁ
దనరుఁ దీర్థము మఱియు స్వార్థమును రెండు. ౨౦

గీ. తనకుఁ దానై లభించినదాని విడువఁ
బ్రాజ్ఞు లొల్లరఁటన్న యర్థంబు వినవె?
వలచి వచ్చినవనితఁ జేపట్టవలయు
ననెడియార్యోక్తి నెన్నఁడు వినఁగ లేదె? ౨౧

చ. మనమున సంశయంబు మటుమాయ మొనర్పుము కూర్మి నాదుపా
వనకరముం గ్రహింపుము శుభం బగు నాశ్రమవృత్తి నుందము

త్యనుపమదివ్యభోగముల నంది చిరంబు సుఖానుభూతితో
మనము వసింతమోయి! పరమంబును గంధము రమ్ము నెచ్చెలీ!"

క. అనుప్రౌఢాలాపములన్
విని "మగువా! నాకు నివియు వేయును నేలా
మనమందు నిశ్చయించిన
వనితను విడనాడి నిన్ను వలతునె?" యనినన్. ౨౩

క. ములుకులవలె నాఁటిన యా
పలుకుల కడలొంది యొక్కపరి దైన్యంబున్
వలవంత యినుమడింపఁగఁ
బలుకున్ లలితాంగి కరుణభావ మెలర్పన్. ౨౪

ఉ. "అక్కట యెన్ని చెప్పినను నాఁడిచేయుదు నామనోరథం
బెక్కరణిన్ ఫలించు నిఁక నీనవమోహనదివ్యరూప మి
య్యక్కనఁ జేర్చి నిత్యము సుఖాంబుధిఁ దేలినఁ గాక నీకు నే
నెక్కడఁ జెప్పుకొందునిఁక యింతుల కామమహాగ్నిదుర్వ్యథల్.

మ. తమవిద్యాకులరూపసంపదలు కాంతల్ చూడఁగాఁ బోరు కా
మమహాభూతము సోఁకినన్ గనరు సన్మార్గానుసంచార మ
త్యమలం బైనపతివ్రతాజనకథాత్యంతార్థముల్ వీనులన్
గమనీయంబుగ సోఁకనీరు పలుకంగా రావు మారవ్యథల్. ౨౫

క. ఏవంవిధకామవ్యథ
సేవింపఁగ నున్న నన్ను శిక్షించెదవే
భావింపుము హృదయంబున
సేవింపఁగనిమ్ము నన్నుఁ జిత్తజరూపా!" ౨౬

చ. అన విని విన్నఁబాటు హృదయంబున సోఁకఁగ "నేమి చేయుదే
మని విడిపించుకొందు నిఁక హా" యని "ఓసతిరూపుఁగన్న డా

కిని! ననుఁ జంపినన్ సరియె కేవల మిట్టిమహాపరాధ మే
నొనరుపఁ జాలఁ బోదు" నన యుగ్మలి నవ్వుచు నాఁపె నాతనిన్.

క. "ఏఁ గెదరుగాక నాపని
సాఁగించినపిదప" ననుడు సద్ద్విజుఁడును "నే
నాఁగెదను నన్నుఁ గదియక
యేఁగిన" ననఁ జనియె నామె యింకొకపనికై. ౨౯

ఉ. అచ్చట మానిచంద్రుఁడుఁ బ్రియంబెసలారఁగ నామె పోవుటన్
మెచ్చి మనంబునం దలఁచె "మీనవిలోచన నెంచిచూచినన్
సచ్చరితంబునన్ వెలయుసాధ్విగఁ దోఁచును కాని యన్య మే
యచ్చునవైనఁ దోఁప దిట నామె వసింపఁ గతం బదెట్టిదో? ౩౦

గీ. ఈమె స్వర్నారియో లేక యిచటఁ బడ్డ
నాగకన్యావతంసమో నాఁగఁ దోఁచు
శాపకారణ మేదో కానోపు నిచట
నీవిధంబున నుండఁ గా కింత యేల?" ౩౧

చ. అని తలపోసిపోసి కరుణామయుఁ డైనమహేశుసత్కృపా
ఘనతయె లేనినాఁడు క్షణకాలమునం జెపియుందు నేకదా
యనితరసాధ్య మైనకృప నందగఁ గంటి మనంగఁగంటిఁ గా
కని వినుతించుచున్ గడపెనాసిసి యెల్ల మహేశులీలలన్. ౩౨

చ. విరహుల వేఁచుటే పనిగ విశ్వమునందుఁ జరించు చంద్రుఁడున్
గర మనురక్తిచే మునిశిఖామణిఁ బ్రోవఁగ నెంచినట్లునో
విరహిణి యైనకాంత కడువేగము మాన్పఁ దలంచియో యనన్
జరమనగంబునం బడియె సారసమండలి సంతసింపఁగన్. ౩౩

ఉ. అంతట లోకమన్ముని మహత్త్వము భక్తియు శక్తిమీఱన
త్యంతతపఃప్రయాసమున నాఁకలిదప్పులు వాసి రుక్మిణీ

కాంతు భజింపఁగాఁ దమము కాలభుజంగమురీతి వ్యాప్తమై
నంతన సత్కృపాకరమహత్త్వము చించినరీతి వేగినన్. 3౪

ఉ. తూరుపుదిక్కునం బొడను తోయజమిత్త్రునియోగమంబు నెం
తోరపు లోకజాలములతో నెఱిఁగింపఁగ వచ్చుచుండెనో
యీరమణీయమూర్తి రుచు లెంతతపఃఫల మందియున్నవో
సారసబంధు లౌట కనుచాడ్పునఁ దోఁచె నుషఃప్రదీపికల్. 3౫

చ. తెలతెల తెల్లవాఱుటయ తెల్పెను గాఢతమంబు నిత్యమై
వెలయదు వచ్చిపోవు నవివేకుల నెప్పుడు నాశ్రయింప నే
మిలమయి శాశ్వతంబు భ్రమియించుట కాని సుఖంబు దుఃఖముల్
వలపక వచ్చిపోయెడు నవాంఛితరీతుల నన్నసత్యమున్. 3౬

గీ. ప్రాగ్దిశాకాంత రేయి తపం బొనర్చి
బాలభానునిఁ గని నీట నోలలార్చ
దివ్యతేజఃప్రభావసందీప్తవితతి
జగతి వ్యాపించె నసఁ దోఁచె గగనలక్ష్మి. 3౭

ఉ. పూర్వదిశానగంబున నపూర్వవికాసవిలాసమూర్తి యై
సార్వజనీనుఁ డై విబుధసారసలోకమనఃప్రియుండు నై
యుర్విఁ బ్రతిష్ఠితుం డగుమహోత్తమదైవతశేఖరుం డనన్
బర్వున వచ్చె లోకపరిపాలనకై నవబాలభానుఁడున్. 3౮

చ. దినసముఖోచితక్రియలు దీర్చినమానికుమారు చెంతకున్
నవనవలాడుసోయగమునం దనరారుచు నద్భుతంబు లై
యవిరళదీప్రపూజములయాకృతిఁ దాల్చినవారిజాక్షి తా
వివశత నంది వచ్చి కడువేడుకతోడ నొనర్చె సత్క్రియల్. 3౯

మ. త్రిజగన్మోహనసుందరాకృతుల నారీశ్రేష్ఠలం బిల్చి మా
నిజనోత్తంసునకున్ బ్రశస్త మగుస్నానీయంబులన్ గూర్చియ

కృజమందన్ నిజహస్తమర్దనములన్ గాఢానురాగంబుతో
నిజలావణ్యవిలాసహాసములతో నీర్వోసె నామానినిన్. ౪౦

గీ. స్వర్ణకలశంబుతోడ స్వర్జలము తీయ
సంధ్యవార్చెను మౌని నిష్ఠానుసార
మగ్నిహోత్రాదికము లెల్ల నాచరించె
నఖిలసామగ్రు లామె యింపారఁ గూర్ప. ౪౧

శా. అష్టావక్రమునీంద్రనందనుని సంధ్యావందనాగ్నిక్రియా
శిష్టాచారమహావ్రతస్థుఁ బరమేష్ఠిజ్ఞానలబ్ధప్రభా
విష్టప్రాభవసద్ద్విజోత్తముని సర్వేశార్పితస్వాంతునిన్
శిష్టగ్రామణిఁ దన్పె నామె వివిధశ్రేష్ఠాన్నభక్ష్యంబులన్. ౪౨

మ. లవమాత్రంబును గొంకు లేక వనితాలావణ్యసౌభాగ్యసం
భవవీక్షాశిఖాళినెల్లఁ దనదౌ భవ్యప్రభావంబునన్
జవహీనంబులఁ జేసివైచుచుఁ గడున్ సత్త్వాధ్యుఁడై కైకొనెన్
"భవలీలావిభవంబులద్భుతము లౌ భావింపఁగా"నం చెంచెన్. ౪౩

గీ. ఈప్రకారము మునికి విం దేర్పరించి
యతని సంతుష్టుఁ గావించె నామె పిదప
నుచితసంభాషణంబుల రుచిరభావ
విలసనంబులఁ బ్రొద్దెల్ల వెళ్లఁబుచ్చె. ౪౪

గీ. కలలయం దైనఁ గననిసంఘటనఁ గాంచి
యీశ్వరవిలాసమాత్రగా నెంచి మౌని
సంభ్రమాశ్చర్యముల వివశత్వ మంది
తగులు లేనిసుఖంబులఁ దగిలి యుండె. ౪౫

గీ. అఖిలదిశలందుఁ దమ మంత నాక్రమింపఁ
జారచోరసమాజముల్ సంతసించెఁ

బరమపుణ్యప్రవిష్టుఁ డౌ భానుఁ డేఁగ
దురితజనులు సుఖించు టబ్బురమె తలఁప. ౪౬

గీ. పంచభక్ష్యాన్నములమానివరునిఁ దనిపి
యభిమతార్థసంసిద్ధికై యామె యతని
నుచితశయ్యోపవిష్టుఁగా నొనరఁ జేసి
తనదుశక్తిప్రభావవిస్తార మెంచ. ౪౭

సీ. అత్యంతసౌరభానంతమై గృహ మెల్ల
ఘుమఘుమవాసనాఘూర్ణ మయ్యె
రమణీయవజ్రకుట్టిమకుడ్యఘనకాంతి
దేదీప్యమానమై తేజరిల్లె
హంసతూలికలపర్యంకమ్ము మార్దవ
పరిపూర్తిచే నూత్నభావ మందెఁ
జిత్రసందీపికాశ్రేణియద్భుతకాంతి
స్వర్ణసందీప్తప్రశస్త మయ్యె

గీ. నేకజగన్మోహనీరూప మొనరఁ దెచ్చె
వర్ణనాతీతశృంగారవస్తుతతిఁ
బుష్పవృష్టి గురిసె నొక్కపూవుఁబోఁడి
యభినవోద్దీప్తమైనపర్యంకమందు. ౪౮

క. కపురంపుతోడిబాగా
లపురూపపుదివ్యగంధ మాలేపనముల్
ఉపదిష్టసర్వవస్తువు
లపూపములతోడ నిండె నాగది యెల్లన్. ౪౯

మ. శతకోటీందుసమానసుందరతనూసౌభాగ్యసంపత్సుశో
భిత మబ్జాస్యము నుల్లసన్మధురచాంపేయప్రభాఘ్రాణ మం

చితచంచద్ఘనచంచరీకచికురశ్రేష్ఠంబు లబ్జాక్షు లా
తతపద్మప్రకరప్రభాంగములతోఁ దారుణ్యసంపూర్ణ లై. ౫౦

మ. అవధానంబున నెల్లవేళలను భక్త్యావిష్టుఁ డై నెజ్జపై
నవలీలన్ శివనామసంస్మరణ నత్యానందసంపన్నుఁ డై
సవిలాసంబున నోలలాడెడుమహాసత్త్వాఢ్యుఁ డౌ మౌనిఁ జే
రి విలాసంబుగ వాంఛచేసె నతనిన్ రిక్తప్రయత్నంబుగాన్. ౫౧

క. ఆసుశ్లోకుఁడు నంతట
వీసంబును భ్రాంతి లేక వివిధార్థములం
జేసెఁ బ్రబోధము నాయమ
కాసక్తియు నంతరింప కను నాతనితోన్. ౫౨

గీ. "పరిణతవయస్కు నై నిన్నుఁ బడయఁ గోరఁ
ద్రోసిపుచ్చఁగ నేపాటివాసి నీకుఁ
బరమలక్ష్మీసమేత నన్ బరిణయమునఁ
గలయుకంటెను భాగ్యంబు కలదె నీకు. ౫౩

క. ఏ నిన్ను స్వేచ్ఛ వలచితిఁ
గానీ యిటు నన్నుఁ ద్రోసి కష్టాత్ముఁడ వై
పో నీకు శ్రేయ మెట్లగు
నో నే నరయుదును జాలుకనోహో పడఁతుల్." ౫౪

గీ. అనుచు బెదరించునాయమ నరసి యతఁడు
"బాల్యమునఁ దండ్రి భర్త యౌవనమునందు
సుతుఁడు వార్ధక్యమునఁ బ్రోచు నతివ సగుట
స్వేచ్ఛ వల దింతి కెన్ని చెప్పినను వినవు. ౫౫

ఆ. కాన నిన్నుఁ గలియఁ గా రాదు నా కిప్డు"
డనిన మౌనిఁ జూచి యతివ యంత

సుభగయానయును శోభితాంగయు నైనఁ
జంచలింపఁ డయ్యె సన్మునియును. ౫౬

"నీవు సామాన్యవనితవు కావు తల్లి!
శాపవశమున వచ్చినస్వర్గవనిత
వో? యెవతెవో? మహాత్మవు పుణ్యురాల!
నిజము చెప్పుము నన్ను మన్నించి తల్లి! ౫౭

చ. కన్నవిని నే నెఱుంగఁ ద్రిజగంబుల నిట్టిమనోహరాంగకం
బుల సురమాత్రలబ్ధఘనపుణ్యఫలామలరూప మెన్న న
త్యనుపమదివ్యదీధితుల నాఱడిచేయుఁ దనుద్యుతుల్ తలం
చిన నిది యంతయున్ బరమచిత్రము చెప్పఁగదే యథార్థముల్.

గీ. త్రికరణంబుల ధర్మ మించుకయు విడక
గురునియానతి పాటించునయఁడ నేని
తావకీనస్వరూపంబుఁ దాల్చి నీవు
నిలచెదవు గాక!" యని ముని పలుకుటయును. ౫౯

ఉ. అంతట స్వస్వరూపమున నాయమ నిల్చి మునీంద్రచంద్రుతో
సంతస మొప్ప నిట్లనుఁ బ్రసన్నముఖాంబుజకాంతితోడ "నీ
వింత కలంగకుండుటకు హెచ్చెను నాకు నతిప్రియంబు నేఁ
గాంతనె కాని యుత్తరపుకావలికత్తెను నీపరీక్షకున్. ౬౦

గీ. ఆవదాన్యమహాత్మసంప్రార్థనమున
వచ్చితిని గాని సామాన్యవనితఁ గాను
అద్భుతము కొల్పె నీనిష్ఠ యమరవంద్య!
సకలశుభములు నీ కిక జరుగుఁగాక. ౬౧

గీ. సుప్రభాదేవిపరిణయశుభము నీవు
నందఁగల వింక దాన నీ కైహికంబు

సుఖదమౌ సర్వశుభములు చూఱకొనుచు
నందఁగల వాపయిని మోక్ష మమలహృదయ! ౬౨

ఉ. నీరుచిరప్రవర్తనము నిశ్చయ మింక జగంబునందు వి
స్తారయశంబునన్ వెలయు శాశ్వత మై మదభీష్టసిద్ధి కిం
పార గృహస్థధర్మపరిపాలనమం దసమానమార్గసం
చారమునన్ గడింతువువిశాలయశంబు శుభప్రదంబుగాన్. ౬౩

ఉ నీదగుబ్రహ్మచర్యఘననిష్ఠ త్రిలోకములందు నెప్పు డా
హ్లాదకరంబు నై జనుల కాదరణీయము నై మహాశుభా
పాదక మై వెలింగెడుఁ బ్రపంచమునందు దినేశచంద్రుల
ట్లాదరణీయు లై మిగుల నర్మిలిఁ ద్రిమ్మరునంత కాలమున్." ౬౪

మ అని దీవింపఁగఁ బుష్పవృష్టి పడఁగా నామ్నాయనాదంబు లిం
పున నాకాశమునుండి వెల్వడియె నొప్పుం జెందె సంకీర్తనల్
మునిశార్దూలునిముందు వచ్చి నిలిచెన్ మోదంబునం బుష్పకం
బును నాకాంతయుసౌధముల్ మఱియుసొమ్ముల్ తోనమాయంబులై.

ఆ. పుష్పకంబు నెక్కి పుణ్యాత్ముఁ డౌ బ్రహ్మ
చారి క్షణములోనఁ జక్క నిలిచె
నావదాన్యునాశ్రమాంగణంబున నంత
నావిమానరాజ మరిగెఁ బ్రీతి. ౬౬

ఉ అచ్చట నావదాన్యుఁడును నంతయు సిద్ధము చేసెఁ బెండ్లికిన్
వచ్చినతోడనే శుభదవాక్యములన్ వినుతించె నల్లునిన్
వచ్చినబంధువర్గములవారలఁ జూపి యథోచితంబుగా
నచ్చటఁ జూపె నాతనిమహాగురుదేవునిఁ దల్లిదండ్రులన్. ౬౭

గీ. గురునిపాదంబులకు భక్తిపరత మ్రొక్కి
తల్లిదండ్రులకును బ్రణమిల్లి పిదప

బంధుజనముల కాదరపాత్రుఁ డగుచు
జరగినది చెప్పె నతఁడు సుత్సాహ మెసఁగ.

గీ. ఆవదాన్యుఁడు జరిగిన దెల్లఁ దాను
దివ్యశక్తి గ్రహించిన తెఱఁగు గురుల
శిష్యులను బంధుజనముల శీఘ్రముగను
శుభమునకుఁ బిల్చి తెచ్చినచొప్పుఁ జెప్పె.

గీ. "నేఁడె సుముహూర్తసమయనిర్ణీతదినము
సుప్రభాకన్య హృదయసంశుద్ధితోడ
ని న్వరించియె యున్నది నీవుఁ గూడ
సిద్ధుఁడవు కమ్ము గురునాన స్వీకరించి."

గీ. అని వదాన్యుఁడు పలికినవెనుక నతఁడు
గురుపదంబులకును మ్రొక్కి యురువిధేయ
తాత్ముఁ డై భక్తిభరితహృదంబుజమున
నతనిదీవెన లంది మిన్నందె వేడ్క.

సీ. విజయసంపాదనావిర్భూతసమ్మోద
వికసితాననపద్మవిస్తరంబు
రంభాదికాప్సరోరామామణీవాంఛి
తానుపాత్తప్రతాత్యంతదీక్ష
గురుదేవపరిపూర్ణకరుణాకటాక్షసౌ
భాగ్యప్రశస్తసంపాదనంబు
శ్వశురపరీక్షానుశాసనోన్నతదిగ్వి
జయలబ్ధిజనితప్రశాంతగరిమ

గీ. అతిశయింపఁగ నొప్పె దివ్యప్రదీప్తిఁ
బెండ్లికొడు కైననాఁడు శోభితమహర్షి

యుత్తమాదర్శవరుఁ డని యువిద లెల్ల
నక్షతల దీవెన లొసంగునప్పు డచట. ౭౨

సీ. నుదుటఁ గుంకుమరేఖ పదనుదీర్చినయట్టి
విజయసాధనఖడ్గవిధము గాఁగఁ
జెక్కుటద్దముక్రిందఁ జిదిమినకమ్మక
స్తురిచుక్క నూత్నసుందరులఁ జేయ
నాకర్ణదీర్ఘ నేత్రాంచలరమణీయ
కజ్జలాప్లావితకాంతి మీఱఁ
జిఱుబంతిపసపు నచ్చెరువందఁ బాదప
ద్మంబుల కలమ సౌందర్య మెసఁగఁ

గీ. బుడమిపైఁ బుట్టి మిగుల నుప్పొంగునట్టి
రతియు మన్మథుఁడును నాఁగ రమ్యముగను
నూత్నదంపతు లొప్పిరమాన కాంతిఁ
దరుణవైవాహికానందధన్యు లగుచు. ౭౩

గీ అమరవంద్యుఁ డష్టావక్రుఁ డయ్యెఁ గాన
నతనివైవాహికానంద మరయ దివిని
నమరతరుణీమణీజాతి యక్షతలను
జల్లి దీవింప నిలిచె నుత్సాహ మొదవ. ౭౪

సీ. లలితంపుమామిడాకులతోడఁ గట్టిన
రమణీయబహుతోరణములతోడఁ
గదళికాస్తంభప్రకాశనూతన మైన
రంభాఫలంబులరమణతోడ
శుకపికాలాపసంశోభితాత్యంతసం
గీతనాదామోదరీతితోడ

స్వస్తివాక్యప్రశస్తనినాదవేదమం
త్రనిరూఢు లౌమహామునులతోడ

గీ. నారచీరలు గట్టి విన్నాణ మొదవ
సాత్త్వికతపోనవద్య లౌసారసాక్షు
లమలహాసానపేతదివ్యాదిదివ్య
లై చరింపఁగఁ బొల్చెఁ గల్యాణవేది. ౭౫

గీ. శుభదమంగళస్నానవిస్ఫూర్తితోడ
నమలతేజోవిలీనముఖాంబుజమున
వరవరిష్ఠుఁ డష్టావక్రవటుఁడు నంత
విమలకల్యాణవేదికావిష్టుఁ డయ్యె. ౭౬

గీ. మంగళస్నానవిహితసౌమ్యప్రదీప్త
సహజసౌందర్యసౌశీల్యసౌమనస్య
సహిత యాసుప్రభాకన్య సరగఁ దెచ్చి
పెండ్లిపీఁటపైఁ గూర్చుండఁబెట్టి రపుడు. ౭౭

ఉ. అంత వదాన్యుఁడున్ సతియు నాదర మొప్పసుతావతంస ము
త్యంతమనఃప్రియత్వమున నర్పణచేసిరి మౌనిహస్తమం
దంతట వేదఘోషము విహాయస మందఁగ మౌనిచంద్రశు
ద్ధాంతబహిర్గతం బగుట ధన్యత నందిరి పుణ్యదంపతుల్. ౭౮

గీ. వేదవిహితానుసార ముర్విప్రతిష్ఠి
తానుకూలమార్గంబున నంత దివ్య
వైభవముతోడ జరిగె వివాహశుభము
మునివతంసులయాశీస్సమోఘము కద ! ౭౯

గీ. అమరకాంతలుఁ బ్రీతిఁ బుష్పములు గురిసి
రతులితానందు లైనదంపతులమీఁదఁ

దల్లిదండ్రులుఁ దనయు నుత్సవముఁ గాంచి
సుతునిఁ గన్నట్టిఫలము నుత్సుకతఁ గనిరి

సీ. మధుపర్కధారణమాహాత్మ్యవిలసితా
 మానసంపద నొప్పుచున్న వేళ
మాంగళ్యజీవనమహితానుభూతికై
 మంగళసూత్రముల్ మడుఁచువేళఁ
గరపద్మవిలసితకాంతివెల్లువలతోఁ
 దలఁబ్రాలు శిరముల నిలుపువేళ
నాజీవితాంతనిత్యానందజీవన
 ప్రామాణ్యవచనముల్ పలుకువేళ

గీ. మునులయాశీఃప్రసాదానుపూర్వ్యముగను
నక్షతాశీస్సుల గ్రహించునట్టివేళఁ
బుణ్యదంపతు లొప్పి రపూర్వపుణ్య
మూర్తులే యని ఋషులు ప్రమోద మంద. ౮౧

ఉ. అందఱకీర్తనంబులకు నాననము న్వికసిల్ల సుప్రభా
సుందరిఁ బెండ్లియాడి మది సొక్కుచునుండె మునీంద్రచంద్రుఁడున్
సుందరమందహాసపరిశోభితమూర్తికి సుప్రభామహా [న్.
సుందరి నిచ్చి తా మురియుచున్ గను మోదము నావదాన్యుఁడు

ఉ. వైదికమార్గపద్ధతు లవారిత మైన తెఱంగునన్ వివా
హాదికకర్మముల్ కడు శుభాంతముగా నట బంధు లెల్ల వ
స్త్రాదికదివ్యవస్తుతతి సాదరభోజనతృప్తితోడ నా
హ్లాదము నంద నిం పెసఁగె నట్టివివాహముఁ గాన మెన్నఁడున్.

గీ. ఆత్మతత్త్వ మెఱింగినయతఁడు వరుఁడు
నాత్మవిద్యాసమేతపుణ్యాత్మ వధువు

నాత్మసింహాసనావిష్టు లచటిజనులు
సమరవంద్యవివాహ మేర్పైన దరియ. ౮౪

శా॥ అష్టావక్రమునీంద్రచంద్రునివివాహానందపుణ్యోత్సవా
విష్టప్రాభవ మాశయం దలఁచి కౌబేరాన్వయం బెల్ల నా
విష్టానందముతో విమానసముదయిక్ విచ్చేసి దీవించె నా
యష్టావక్రునిసుప్రభన్ బ్రబలహర్షాంభోధిఁ దేలించుచున్. ౮౫

సీ. సుప్రభాష్టావక్రసురచిరదాంపత్య
వైభవానూనసంపదల నెంచి
యనుపమాదర్శకన్యాదానఫలసము
ద్భూతువదాన్యునిఁ బొగడి పొగడ
గురుదేవసత్కృపాగురుతయే యది యంచు
గురుదేవు నధికతత్పరత నెంచి
సుప్రభాకాంతానుసుకృతసార మటంచు
సుప్రభాకాంతను స్తుతు లొసంగి

గీ. యమితహర్షాంబునిధి నోలలాడి యాడి
యచ్చెరువుగొల్పువర్తన మభినుతించి
యెల్లవారలుఁ దమతమయిక్కలకును
వెడల లేక వెడల లేక వెడలి రంత. ౮౬

గీ. గురుసహితుఁ డైనజామాతఁ గొన్నినాళ్లు
తనగృహంబున నుంచి వదాన్యుఁ డెల్ల
యభిమతార్థసంపూజన మాచరించి
యమితహర్షాంబునిధి నోలలార్చి పిదప. ౮౭

ఆ. అల్లునభిమతంబుఁ జెల్లింపఁగా గురు
నాన దాఁటకుండ ననుమతించెఁ

గూఁతుసుప్రభఁ గడుఁ గూర్మి నత్తింటికి
నంప నతఁడు నధికహర్ష మొదవ. ౮౮

మ. తనవిధ్యుక్తము నిర్వహించినమహాత్మ్యానూనసంతృప్తిఁ బా
వనుఁ డైనంత వదాన్యుఁ డించుకయుసంప్రాప్తానురాగుండుగా
కనియెన్ గూఁతును బిల్చి పంపునపు డత్యంతాదరార్ద్రుండు నై
ఘన మౌదీవెనలున్ సువస్త్రము లలంకారంబు లందిచ్చుచున్. ౮౯

శా. "అమ్మా! సుప్రభ! యింతదాఁక నిను నాపత్యంబుగాఁ బెంచి నే
నిమ్మాన్యాత్మున కొప్పగించితిని సర్వేశార్పితస్వాంతతన్
గొమ్మా నీహృదయాంతరాళమున నీకున్ జేసియున్నట్టి బో
ధమ్ముల్ వేఱెఁకఁ బల్కుటయ్యది రవిన్ దర్శించుటల్ దివ్వెతోన్.

గీ. పుట్టినగృహంబు మఱియును మెట్టినట్టి
గృహము పావన మొనరింప నిహమునందుఁ
బరమునందు స్వభర్తతో బ్రహ్మపదముఁ
గనుట యాదర్శ మదికదా కన్నతల్లి! ౯౧

శా. దేహాభాసవిచారణంబుఁ గర మర్థిం జేయుచున్ నీవు నీ
దేహాదిశ్రమ లెన్నికల్గినను నార్తిం జెందఁగాఁ బోకు ము
త్సాహామూల్యధనంబుచే సతము భర్త్రాజ్ఞానుసారంబుగా
'సోహంసోహం!' యని సర్వలోకములు నిన్మాహింప వర్తింపుమా"

చ. అనుచు వదాన్యుఁడున్ సతియు నర్మిలి గాదిలిబిడ్డఁ బ్రేముడిన్
బనుపఁగ నుత్సహించుచు మనంబుఁ దలంకఁగ మోహపాశమ
త్యనుపమ మైన నశ్రువుల ధైర్యమునన్ బడనీక యుంచుచున్
దనయను బంపి రెట్టులొ; విదారకముల్ కద మోహపాశముల్!

గీ. బంధములు లేనిగురుఁడు సబంధుకముగ
శిష్యసంతతికొలువ విచ్చేసెఁ దాను

నేకపాదుని ప్రార్థన మెంచి ప్రీతి
నతనియాశ్రమభూమి కత్యాదరమున. ౯౪

గీ. అంత నేకపాదుండు గృహప్రవేశ
శుభము నడపె నష్టావక్రసుందరులకు
విందొనర్చెను భక్తి నాఁ డందఱకును
పిదప గురుఁడు దంపతులఁ బిల్పించి ప్రీతి. ౯౫

చ. ఇరువుర మానసంబు లొకయింతయు భేదము లేకయుండఁగా
నరసి గృహస్థధర్మములు నర్థవివర్జితసర్వకర్మముల్
బరమదయాసముద్రు లగు బ్రహ్మమునీంద్రులపాదసేవయుఁ
బరువడిఁ జెల్పి సర్వసమభావము నంత యథేచ్ఛమై చనెన్ ౯౬

శా. అష్టావక్రునితల్లిదండ్రులును దా రత్యంతసంభావ్యసం
తుష్టస్వాంతులునై కుమారవరుఁడుఁ గోడల్ ప్రభాదేవియుఁ
శిష్టానందులు గొల్వఁ గొన్నిదినముల్ స్వేచ్ఛఁ సుఖం బంది తా
మిష్టావాప్తి గడించి యేఁగిరి మహాతృప్తిఁ సభోగాములై ౯౭

సీ. నిశ్చంచలబ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై
తనధర్మపథ మింత తప్పకుండ
గార్హస్థ్యధర్మసగౌరవానుష్ఠాన
నిత్యకర్మకలాపనియతితోడ
నతిథిదేవాభ్యాగతాత్యంతబాంధవా
దరపాత్రుఁడై సత్స్వతంత్రుఁ డగు
నాస్తంబబ్రహ్మపర్యంతమ్ము సమభావ
మాత్మభావము నిత్య మమరుచుండ

గీ. సుప్రభాకాంత కలిసివచ్చుచు నుతింప
నఖిలభాగ్యముల్ పుత్త్రపౌత్త్రాభివృద్ధి

నంది యాదర్శజీవనానందుఁ డగుచుఁ
గడపెఁ గాల మష్టావక్రఘనుఁడుఁ బిదప. ౯౮

గీ. ఎల్లవిధముల నాథునియుల్ల మెఱిఁగి
యనుసరించి పతివ్రత యై సతఁబు
శౌచలక్ష్మి యనంగ విస్తారయశముఁ
బడసి యాదర్శనారి సుప్రభ వెలింగె. ౯౯

గీ. ఆప్రకారము జీవితయాత్రఁ గడపి
బ్రహ్మవిజ్ఞానసంపదఁ బడసి తుదకు
బ్రహ్మనిర్వాణ మంది రాభవ్యదంప
తులు నుతింపఁగ ముల్లోకములును భక్తి. ౧౦౦

క. అష్టావక్రచరిత్రము
నిష్టావాప్తికిఁ బఠింతు రెవ్వరు వారల్
శిష్టాచారత విందు ర
వష్టంభము లేక కాంత్రు బహుశేప్సితముల్. ౧౦౧

మ. అనిభీష్ముండుఁ గృపాపరాయణత నీయాఖ్యానముం జెప్పఁగా
ననువొందంగ యుధిష్ఠిరుండు విని యత్యానంద నిర్మగ్నుఁ డై
తనప్రశ్నంబున కుత్తరంబు గలుగ౯ ధన్యాత్ముఁ డై సన్మునీం
ద్రుని భీష్ము౯ వినుతించె నెంతయును సంతోషంబు రేకెత్తఁగన్.

## ఆశ్వాసాంతము.

శా. బ్రహ్మణ్యప్రవరాఖిలాంధ్రజనసుబ్రహ్మణ్యచూడామణీ!
బ్రహ్మార్పితసర్వజీవనమహాభాగ్యప్రభావోదయా!
బ్రహ్మజ్ఞానవిరాజితోన్నతశుభప్రఖ్యాతజీవామలా!
బ్రహ్మానందవిధాయకా! త్రిభువనబ్రహ్మణ్యసంధాయకా!

పంచచామరము :

శివా! శివా! యటంచు నెప్డు చిద్విలాససంపదన్
భవాబ్ధి నొక్కలీల దాఁటి బ్రహ్మతత్త్వభాగ్యమున్
జవంబుతోడఁ గాంచి దివ్యసత్త్వమూర్తి యై మనున్
భవంబునుండి బ్రోచునట్టి భద్రమూర్తిఁ గొల్చెదన్. ౧౦౬

గద్యము. ఇది పరమేశ్వరస్వరూపగురుకటాక్షలబ్ధకవిత్వ గౌతమ
సగోత్రపవిత్ర వేంకటేశ్వరపౌత్ర వేంకటసుబ్రహ్మణ్యేశ్వ
రాన్నపూర్ణాదేవీ చతుర్థపుత్ర బులుసు వేంకటే
శ్వరప్రణీతాష్టావక్రచరిత్రమునందుఁ
దృతీయాశ్వాసము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



వావిళ్ల ప్రెస్, మదరాసు.—17-7-46 (500.)

# సవరణలు.

ఈ క్రింది సవరణలు ముందుగనే పొందుపఱుచుకొందురుగాక!

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 22 | వేంట | వేంకట |
| 3 | 24 | సీతరాముఁడు | రామశాస్త్రియుం (సీతారామశాస్త్రి) |
| 6 | 17 | కిని సు | కిని |
| 11 | 16 | వక్రుండుగాఁ | వక్రతలం |
| 14 | 3, 4 | "...ఘఁ, బు | క, "పు |
| 15 | 7 | బాలుం | చాలుం |
| 15 | 11 | గూర్చొనఁ | గూర్చివిఖం |
| 16 | 23, 24 | స్వ, స్తనయుఁన్ | వ, త్సను దాఁ |
| 17 | 18 | కాంచెసె | కాంచెను |
| 25 | 13 | అతని | అశని |
| 33 | 12 | జాఱు | జాఱ |
| 49 | 19 | సంద | సంపద |
| 61 | 23 | మింపఁ | మింప |
| 62 | 11 | ఫూర్తి | పూర్తి |
| 63 | 20 | డండ్రి | దండ్రి |
| 71 | 10 | దివ్వ | దివ్వె |
| 72 | 10 | చసెన్ | ఁజసెన్. |

## సూచన.

'కలఁతు' (పీఠి. ౭.) 'ఎన్నఁడున్' (పీఠి. ౨౧.) 'చిన్నఁబోయిన' ౧ ఆ, ౩౯.) 'సర్వముఁ' (౧ ఆ, ౪౭.) 'ఆరయఁ' (౧ ఆ, ౯౨) 'భక్తిఁ' (౧ ఆ, ౧౧౧.) 'అనిపెఁ' (౧ ఆ, ౧౧౯.) 'పాడఁగాఁ' (౨ ఆ, ౩౦.) 'అందెఁగా' (౨ ఆ, ౮౫.) 'చంద్రుఁడు' (౩ ఆ, ౮౨.)

ఇం దఱునున్న లంటలేదు. చేర్చుకొందురుగాక!